శ్రీసద్గురవేనమః.

---

ఇది

శ్రీమద్గురు శివరామదీక్షితీయంబను

# అచలగ్రంధము.

---

అచలగురుని శిష్యుడైన

హో॥ల. శేషాచలాహ్వయునిచే

సవరింపంబడి

అచ్చువేయించి ప్రకటింపంబడెను

మొదటికూర్పు. ౧౦౦౦-కాపీలు



Madras.

V. N. JUBILEE PRESS.



దీనివెల రూ॥ ౧.

౧౮౯-సం॥ఆగష్టునెల౧-తేది

Price Re. 1.

శ్రీసద్గురవేనమః.

ఇది

శ్రీమద్గురు శివరామదీక్షితీయంబను

# అచలగ్రంధము.

అచలగురుని శిష్యుడైన

పో॥ ల. శేషాచలాహ్వయునిచే

సవరింపంబడి

అచ్చువేయించి ప్రకటింపంబడెను

మొదటికూర్పు. ౧౦౦౦-కాపీలు




Madras.
V. N. JUBILEE PRESS.



దీనివెల రూ॥ ౧.

౧౮౮౯-సం॥ఆగష్టునెల౧-తేది

Price Re. 1.

| గ్రంథములవివరం. | వెలలు. | | పోష్టేజి. |
|---|---|---|---|
| శ్రీశివరామదీక్షితీయమను అచలగ్రంథమునకు. | రూ. ౧-౨-౦ | — | ౦-౧-౧ |
| శ్రీకృష్ణబోధామృతమను పంద్రెండురాజులకథలుగలగ్రంథమునకు. | రూ. ౦-౧౩-౦ | — | ౦-౧-౨ |
| ష.చ్ఛక్రవర్తులయింద్రజాలపు కథలుగల గ్రంథమునకు | రూ. ౦-౮-౦ | — | ౦-౧-౨ |
| శ్రీకృష్ణోద్ధవసంవాదమను పరమపదమార్గమను గ్రంథమునకు. | రూ. ౦-౮-౦ | — | ౦-౦-౬ |
| శుకపంచవింశతియను చిలుకచెప్పినయిరువదియైదుకథలుగల గ్రంథమునకు | రూ. ౦-౮-౦ | — | ౦-౧-౨ |

వేదాంతగ్రంథములు చెన్నపట్టణం పెద్దినాయనిపేట నాటుపిళ్లారిగుడివీధి కవాటసంఖ్య (౨౦) గల మందిరమున వాసముచేయుచుండెడు పోకల. శేషాచలమునాయనివారిపేరట రిజష్టరుచార్జితోడ పైకమునుబంపించి గ్రంథములను తెప్పించుకొనవలయున

# అచలగ్రంథము.

## వి ష య సూ చి క



శిష్యుఁడు అప్పయ్యమంత్రి.





అచలగురుఁడు, శివరామదీక్షితులవారు.



శ్రీసద్గురవేనమః.

# అచలగ్రంథము.

శ్రీమద్వేదాంతసారుండును, సచ్చిదానందరహితుండును, అచలపరిపూర్ణుండునునైన నిజగురు శ్రీమద్రామమమగు, శివరామదీక్షితులవారిచే, నిఖిల జగదుపకారార్థంబుగ, సకలముముక్షుజనప్రియంబుగ, రచియింపంబడిన, గురుశిష్యసంవాదరూపకమైన యచల గ్రంథము.

## పూర్వభాగము.

### కారణరహితప్రకరణము.

వత్సా! సర్వమునుగుఱుతెలిసికొనెడి యీశరీరమేమియులేదు. కోటిసూర్యక్షుని దేష్టాపకము, ఇంతకంటెనెక్కువ లేదు, ఈశరీరమునమ్మవద్దు, కలలోనున్న శరీరము పున్నన్న లేదని నిశ్చయముండవలయును. ఇటులనిశ్చయమైనను భ్రాంతిరహితము. మూలములేని యీగుఱు తెలిసికొనెడుశరీరమే మాయున్నదనియాశపడిన, భ్రాంతిరహితముకాదు, ఏమియునులేను మూలములేని యీగుఱు తెలిసెడు శరీరమున్నదనుభ్రాంతి, రజ్జువునందు సర్పభ్రాంతి. ఉన్నట్లు తోచుచుండెనే, పుట్టిరి చావనిది ...

కల దేశములందును, సర్వకాలములందును, సమస్తవ స్తువులందును చలించకనుండఁగా, పాముతోఁచినటుల మూలములేని యీగుణములెల్లఁగెడు శరీరముతోఁచినదే గాని, కలలోనున్న శరీరము మేల్కన్న నేమిలేదని నిశ్చయముకావలయును. "గురువాక్యము మూలము లేని యీగుణములెల్లఁగెడు శరీరమేమిలేదని చెప్పఁగానే" ఆదేప్రకారము నిశ్చయముకావలయును, నిశ్చయము కానియెడల మఱియొకమార్గములేదు. ఏమార్గము నమ్మిన నీరాజమార్గమునకుసాటిగాదు. దొంగత్రోవ లకు లెక్కలేదు. ఇటువంటిగురువాక్యము,మూఁడుకాలములయందును లేదు. ఇదినమ్మక మఱియొకటినమ్మిన నాశమాత్రమేకాని, భ్రాంతిపోక నే, విస్తరించును. బుద్ధిమంతులైనవారికేగాని, దక్కినవారికి నలవికాదు. ఇది భ్రాంతిలేనివిచారణ. గురుసేవయున్న కొలఁదిసుఖకలుగును. గురుభక్తివిస్తరించిన కొలఁదితనకుపృథకగును. గురువాక్యమును విడువఁగూడదు. ఇది జ్ఞానశాస్త్రములవంటి కల్లఁతవాక్యముకాదు, ఇంతకంటె నధికము లేదు.

శ్రీకృష్ణస్వామియొక్క జాగ్రత్తయునిటువంటిదే, ఆస్వామికంటె నెక్కువజాగ్రత్తగలది రుక్మిణీదేవి, ఆ జాగ్రత్తయే మిగులవిశేషము. శ్రీకృష్ణస్వాముల

వారు, సాందీపమహాఋషిదగ్గరకుం బోయివచ్చినతరు
వాత, ఆదేవి మీరేమివిచారించివచ్చితిరని యడిగిన
నేమియునుజెప్పకుండెను. ఆదేవి యేమియునుజెప్ప
క నిశ్శబ్దముగానుండుటే సరియైనమార్గమని పలికెను.
శ్రీకృష్ణస్వామి తనకంటె నామెయెక్కువబుద్ధిశాలియ
నిసంతసించి, పరమరహస్యమైన గురువాక్యమును, స
విస్తరముగనారుక్మిణీదేవికిఁజెప్పసాఁగెను. అదియెట్లనఁ
గా, ఓరుక్మిణీ మూలములేని యీగుఱ్ఱపుశరీర
మేమిలేదనిచెప్పెను. అందుకు రుక్మిణీదేవి, కలలోనుం
న్నశరీరము మేల్కన్న నేమైనయున్నదా, అటువలె
మూలములేని యీగుఱ్ఱపుశరీరమేమి లేదని చె
ప్పెను. చెప్పఁగానే, శాబాసని నవ్వి, ఆమెయందు
ప్రేమఁగలవాఁడయ్యెను,తక్కినవారు సామాన్యస్త్రీలే
గాని, భ్రాంతిరహితులుగారని యోచించెను. కాఁబ
ట్టి కలలోవచ్చినశరీరము మేల్కనిననేమియు నుం
డదో, అటువలె మూలములేని యీగుఱ్ఱపు
శరీరమేమియులేదు, గురువాక్యముచేత మేల్కనిననేమి
యునులేదు, సరిపోయెను. కలలోవచ్చినశరీరమును, ఈ
శరీరము నొక్కటేనా, రెంటికినీపత్తు హెచ్చుతక్కు
వలుండునా? శరీరమునకు మూలములేదుగాఁబట్టి రెం
డును సమానమేగాని, అదిలేఁతశరీరము, ఇది ముదు

సుశరీరముకాదు, దీనికంటెనదే పెద్దగి, ఇదేయనాథసిద్ధము. కలలోనేనుగు హరిశ్చంద్రరాజును, అనేక కోట్లగుఱ్ఱములును, అనేకకోట్లమనుష్యులును, మూలము లేకనే వచ్చిరి, నూరుసంవత్సరములుండి ధర్మార్థములు చేసిరి, అనేక గోదానభూదానములు చేసిరి, అందులో సన్యాసులు, అద్వైతమేదొడ్డదని కొందఱితో వాదించిరి. పెద్దవైష్ణవుఁడు, విశిష్టాద్వైతమేదొడ్డదనియును, అఖండమనియును యుక్తిచేసి, కొందఱితో వాదించెను. అందులో పెద్దమధ్వాచారి, ఏమియును కాని దేహమునుజూచి తానుజేయుదునని, జీవుఁడువేఱు, ఈశ్వరుఁడువేఱని, ద్వైతమేలెస్సయని, కొందఱితో వాదించెను. అందులో, భాస్కరాచార్యుండను మనుష్యుఁడు, జ్ఞానమునిబద్ధియనెను, అదియేలాఁగనఁగా. కుక్కగుఱ్ఱు తెలిఁగెడు స్వభావముగలది, అలాఁగె, అంటఱును తమకుఁదామే గుఱ్ఱు తెలిఁగెడువారుగాను న్నారు, అందుకేతనకుఁదానేయెఱుఁగును, అనేక కోట్లు కాలఁదివచ్చినవెఱుఁగును. ఈగుఱ్ఱు తెలుఁగుట యభేద్యము, నాకంటెనెందఱు వేఱుగానున్నారో, వారందఱు ను, అభేద్యమే. కనుక జ్ఞానమునిబద్ధియే, కర్మమునిబద్ధియేయనివాదించెను.

గుఱ్ఱు తెలుఁగక కర్మములుచేయుదు, గనుక గుఱ్ఱు

తెలియఁగెడుజ్ఞానమే సకలకర్మములుచేయుచున్నది. అయి
ననుకొందఱు దేహమే చేయుచున్నదనివాదించుచున్నా
రు. అదియపార్థమే, కాఁబట్టి, వచ్చునప్పుడు గుఱుతె
లియఁగెడు జ్ఞానస్వరూపములై వచ్చినవి. ఉన్నంతవరకు
జ్ఞానమేయున్నది, మేల్కన్న నేమిలేదని యందఱికితెలు
సు. ఇప్పుడేదిగుఱుతెలిసితిమో, అదే పెద్దల సిద్ధాంత
ము. మేల్కన్న నేలాగున, ఏమియునులేకపోవుచున్న
దో, ఆలాగుననే, మూలములేని యీగుఱుతెలియఁగెడు
శరీరమున్ను లేదని, గురుస్వామిచెప్పఁగానే, పుట్టనిచా
వనిది సకలదేశములయందు, సమస్త వస్తువులయం
దు, మొదలుకొనలేక, స్వతస్సిద్ధమై సర్వకాలమొ
క్కరీతిగానేయున్నది, జ్ఞానమే సకలభూమిలకు మూ
లము,మూలములేనిదియీగుఱుతెలియఁగెడుశరీరమేకాని
మఱియొకటిలేదు. కనుక గురువాక్యమునునమ్మక, శా
స్త్రవాసనలో ప్రవేశించినయెడల భ్రాంతి నశింపదు.
అయ్యా! కలలోవచ్చిన శరీరము మేల్కనిన నేమియు
నులేదని యీదృష్టమందఱికిఁగద్దుగదా? నాకు మీరు
దేహమునకు మూలములేదనిచెప్పితిరి, మూలములేని
యీగుఱుతెలియఁగెడు శరీరమును నమ్మవద్దంటిరి, మీరు
నాకు మూలములేని యీశరీరమేమిలేదని చెప్పఁగానే,
ఏమియున్నదో, అదేయుండెను. ఇఁక భ్రాంతిపోవుటకి

మణులమణులయనెదరు, మహానుభావులుమీరునరేకాని, నాకు మహాభయమనెను. అటులయినఁ గలలోనచ్చికొంతసేపుండి మేల్కొనిన నగముపోయి నగముండుచున్నదే, ఏమిభయం? భయమేలేదు. అలాగుననే, మీవాక్యముచేత నీమూలములేని గుణుతెలిఁగెడుశరీరమేమిలేదని దృఢముగాఁజెప్పినపుడే, నాకునమ్మకమైనది. ఇంతేకాని సర్వకాలములేదుగదా? అనియనెను. అయ్యా! కలలోనెప్పుడైననేడ్చితినేని, నాకులేకున్నదుఃఖమువచ్చుచున్నది, అదేమి చెప్పుడనెను. బంగారుమూటఁగట్టుకొనిపోవుచుండువారితోఁగూడనొకగవ్వైననులేనివారుపోయినయెడల, భయములేనివారికిఁగూడాభయముపుట్టును, ఉన్నవారి సహవాసదోషముచేతఁగలుగుచున్నది. కనుక నున్నవారికి, లేనివారికి, సహవాసములేదా, కద్దా? కలలోఁగొందఱికిఁగద్దు. నీకున్నదా లేదా? సర్వకాలముకలదే. అట్లయిన, నీకు సుఖదుఃఖములున్నవా లేవా, నాకుంజెప్పుము. అయ్యా! నేను వెఱ్ఱివారిసహవాసముచేసిన, నాకువెఱ్ఱిపట్టును, నత్రివారితో సహవాసముచేసిన నాకునత్రివచ్చునని చెప్పెను. గురుఁడు శాభాసుని, నీకింత దృఢమెప్పుడున్నదో, ఇకనాయొద్దకురాకు, నాతోఁగూడనుండకు, నాకౌశల్యమునఁబడ్డావు. అయ్యా! ఒక

విజ్ఞాపనము, దృఢమెవరికి, వచ్చుటేమి పోవుటేమి, కూడనుండునదేమి, అందతిజోలి పుచ్చుకొనునదేమిచె ప్పుమనెను. ఏమి ఏమోననెను. మీరుచెప్పకుండిన నె వరుచెప్పెదరు. అట్లయిన, అడుగువారెవ్వరనెను. నా కేమి తెలియదు, నేనుజదువుకోలేదు, నేనేమియెఱుఁగ ననెను. ఎఱుఁగకుండిన జ్ఞానివే, అజ్ఞానివే. నాకునిటు వంటి నీచఁపుమార్గము నాగురుఁడుచెప్పలేదు, మాగు రుస్వాములంతటి కొంటెవారుకారు, నాకురాజమార్గ ము సూచనఁజేసిరి, వారివంటివారు వారేకాని వా రికిఁబదులులేదు, ఈమార్గమిటువంటిది, ఇది పరమగు హ్యము, మూలములేని యోగులుతెలిఁగెడు శరీరము తానై యున్న పతితులకుఁజెప్పవద్దనిరి. శాస్త్రములు నిజమనినమ్మువారికిఁజెప్పవద్దనిరి. దేవభ్రాంతిఁగలవా రికిఁజెప్పవద్దనిరి. ఎదుటనిలిచివాదించువారికిఁజెప్పవద్ద నిరి. గురుసేవచేయనివారికిఁజెప్పవద్దనిరి. కర్మములుని జమనినమ్మువారికిఁజెప్పవద్దనిరి. అభిమానులకుఁజె ప్పవద్దనిరి. నేనదియనిన వాదేయనువారికిఁ జెప్పవద్దని రి. వైరాగ్యముదొడ్డదనడు మూర్ఖులకుఁ జెప్పవద్దనిరి. మొద్దుబుద్ధిగలవారికిఁజెప్పవద్దనిరి.సూచనఁజేయఁగానే,

చెప్పుమనిరి. స్త్రీలకైన, పురుషులకైన, భ్రాంతిర

హితులు కావలె కావలెనని, మిక్కిలి యిచ్ఛయుం డువారికిఁ జెప్పుమనిరి. మోక్షభ్రాంతియున్న వారికిఁ జెప్పవద్దనిరి. బద్ధులమను భ్రాంతిఁగలవారికిఁ జెప్పవద్దనిరి. అనుభవభ్రాంతియున్న వారికిఁ జెప్పవద్దనిరి. అది నేనైతినని యనుభవము కావలెనని భ్రాంతియున్న వారికిఁ జెప్పవద్దనిరి. నేను నేనని వాదించువారికిఁ జెప్పవద్దనిరి. నా మతము దొడ్డదను మూర్ఖులకుఁ జెప్పవద్దనిరి. శ్రవణభ్రాంతి, మననభ్రాంతి, నిధిభ్రాంతి, ధ్యానభ్రాంతియున్న వారికిఁ జెప్పవద్దనిరి. ద్వైతభ్రాంతి, మతాంతరభ్రాంతియున్న వారికిఁ జెప్పవద్దనిరి. ఏభ్రాంతియును లేక, ఎవరు సూచనఁ జేయుదురోయని యత్యంతాసక్తిగలవారి వయస్సును, సూక్ష్మప్రజ్ఞయును గనిపట్టి సూచనఁ జేయవలయునని చెప్పిరి.

"మిధ్యావిభేనతన్మార్గం దుర్లభం" అనియున్నదిగనుక దొంగతనము చేత వచ్చినవారికి సూచనఁ జేయరాదు. తనకుఁ దానే గ్రహించిన మిక్కిలి దొడ్డవాఁడు, వానికి వాఁడే మునిగిపోవుచున్నాఁడు. సకల దేశములయందు, సర్వకాలములయందు, సమస్త వస్తువులయందు, మొదలు తుద లేని యచలముయొక్క జాడ దొరకక, గాఢనిద్రలో, కలలు, పండులు, గాడిదలు మునిగి, మఱిలఁ దేలినటులఁ దేలువాఁడగుచున్నాఁడు. వాఁడు దొంగ

లలోపల దొంగ. వాఁడు సాంప్రదాయకుఁడుగాఁడు, ఐనమన కేమి, కాకుండినమన కేమి. అచలగురునికటాక్ష మటువంటిది కాదు. మా సాంప్రదాయము భ్రాంతిలేని సాంప్రదాయము. స్వామీ! ఆలాగుననే నాకుంజెప్పుఁడు. కలలోఁ దనకుఁదానే యీగుటు తెఱేఁగెడు శరీరమువచ్చి, తనకుఁదానే కొంతకాలముండి, వెంటనే యేమిలేకపోవును, ఆలాఁగుననే యీగుటు తెఱేఁగెడుశరీరము మూలములేనిదే, తనకుఁదానే తనవంటి మూలములేనివానినిం బెండ్లి చేసికొని, అనేక యాఁడుబిడ్డలను, మగ బిడ్డలను గని, తన ముక్క గుటు తెఱేఁగెడువారినింజూచి, నాకీసంసార భ్రాంతి తగిలినది, నాకుశీఘ్రముగా భ్రాంతిలేకుండా, సాధనములేకుండా, అనాయాసమైన రాజమార్గమునుసూచనఁజేయుఁడు; చేసినశీఘ్రముగాఁ గనుఁగొందును, ఇదిమహాయనాయాసమైన రాజమార్గము, అక్కడక్కడ వినివచ్చినాను, ఇదియీగుల తెప్పపాటుకన్నయనాయాసము, నాకు మహాసముద్రమువలెనున్నది. ఉండనిమ్ము. నీకుమహాతీవ్రమేమియనెను. అయ్యా! చూచుచుండఁగానే యీగుటు తెఱేఁగెడు శరీరమేమిలేకపోవునని, నాకుభయముకల్గు, అందుకే మహాతీవ్రమనెను. అట్లైననీవేమియనెదవు. పుట్టనిచావనిది సక

లదేశములయందు, మొదలుతుదలేక చలించకయు న్నదన్న నదెక్కడయున్నది, అదేమియనిన,నాలుగుది క్కులు మీఁదక్రిందఁజూచెను, నరేకాని నేనేలాగుచూ చెదననెను. నీవున్నదోలేదోయని యనుమానములే దుగదాయనెను. నేనున్నదనినయున్నది. అనేకకోట్ల జనులులేదులేదన్న నదేయున్నది, నేనింతసేఁపేమో యనినను యాశ్చర్యపడినను, ఇప్పుడేమియడిగితినో యదితప్పవిడిచి, రెండవదేమిలేదని నాకుదృఢమైనది. ఎటువంటిమూర్ఖులకును, మూఢులకును, దృఢమైయు న్నది. అదియనాయాసమే, అందుకేమి రాజమార్గ మునరేకాని, ఈదేహమేలాగువచ్చెను చెప్పుడు. ఘు ట్టివాఁడవే, మునుపేచెప్పితినే. మీకాళ్లకుమ్రొక్కెద ను, మఱియొకసారిచెప్పుడు. అట్లయినవినుము. కలలో దేహములెక్కడనుండివచ్చినవిచెప్పుము. ఏమిలేదు, త మకుఁదామేవచ్చినవి, తమకుఁదామేయున్నవి, తమకుఁ దామే సమస్తవ్యవహారములు చేసినవి, మేల్కనిన యేమిలేదు. అదినిజమేనా? ఇదియందఱికిని దృఢమే. ఈలాగుననే, మూలములేని యీగుణులెఱిఁగెడుశరీర మేమిలేదు. ఇదినిజమేనా? ఇదియదార్థము. నిబద్ధమేమి లేదు, అబద్ధమేమిలేదు, శరీరములేనిదేయున్నది. శా బాసు! ధన్యుండవే. ఎంతటివాఁడవు, ఈలాగుననెవరు

చెప్పిరని చూచెదమనఁగా నేమిలేదు, ఎప్పటియచలమే యున్నది, రాకపోకలులేదు, ఉన్నదున్నట్టేయుండెను. మునుపటియాఁడుదానికంటే నీవుదొడ్డవాఁడవు, ఈవిద్యకుఁదగినవాఁడవే, ఈలాగుననుండవద్దా, ఇదే మహాదొడ్డగురుని సాంప్రదాయము, మిగిలినవి దొంగత్రోవలు, ఛీఛీ వాటినిస్మరించరాదు, వినరాదు, చూడరాదు, దీనికేమిలేదు, పుట్టనిచావనియచలము పుట్టినదికాదు, రెండవదేమిలేదు, ఈమార్గము సర్వకాలమొక్కటేవిధము. ఈశరీరమెటువంటిదనిన, చేయడములేదు, విడుచుటలేదు, ఊరకయుండుట నేమియును లేదు. వింటివా? శరీరజన్యమను గుణులెఱఁగెడుజ్ఞానము, జ్ఞానముచేతనే కర్మములు, ఇంతేకాని, శరీరములేని యీయాయుత్త బట్టబయలునకెఱుకలేదు, కర్మములులేవు, సర్వకాలమొక్కటేవిధము, ఈశరీరమెటువంటిదనఁగా, సర్వశూన్యమెటువంటిదో, అటువంటిదే, శరీరములేకుండిననేలాఁగున్నదో, పరిపూర్ణమాలాఁగేయున్నది, అందఱు పరిపూర్ణమేకాని, మూలములేని యీగుణులెఱఁగడు శరీరమనెడి యావరణముచేతఁగప్పఁబడియున్నాఁడు. ఈయావరణమునునాయాసముగా విడువవచ్చును, కలలోనున్న యేనుఁగు మేల్కనినసేమిలేదని, తనకుఁదానే దృఢమైనటులు, మూ

లములేని యీగుణములెత్తెఁగెడు శరీరమేమిలేదని దృఢ మాయెను. తనకుఁ దానేపరిపూర్ణము స్వతస్సిద్ధమైచ లించకనున్నది. ఈశరీరము శాశ్వతముకాదు. అశా శ్వతమైనది. ఏమిలేనిది. విత్తనములేని చెట్టున్నదనిన మ్మవద్దు. సన్యాసియెప్పుడునేమియునులేనివాఁడు, ఏమి లేనివాఁడే సన్యాసి. సన్యాసికిమూలమేమి? శరీరమునకు మూలమేదో, సన్యాసికినదేమూలము. శరీరమునకు మూలములేదు, సన్యాసికిశరీరములేదుగనుక, నేమి యునులేనిశూన్యమే సన్యాసి. అందుకే, కొందఱేమి లేని జీవుఁడున్నాఁడని, అవిద్యయున్నదని, ప్రకృతి యున్నదని, ఆత్మయున్నదని, కారణమున్నదని, గు ణుతెత్తెఁగెడుజ్ఞానమున్నదని, అజ్ఞానములేదని, సచ్చి దానందమున్నదని, జాగ్రతకలదని, స్వప్నమున్నదని, సుషుప్తియున్నదని, తుర్యమున్నదని, తుర్యాతీతము న్నదని, చిదాకాశమున్నదని, గుణుతెత్తెఁగెడుక్షేత్ర జ్ఞస్వరూపమనెడి యాత్మవలన నాకాశముపుట్టినదని శరీరములోపల గనుగొనవలయునని,శరీరమునకుబైఁ టలేదనిచెప్పియున్నారు.

"ఆత్మానాకాశానిసంభూతాని" అనిశ్రుతియున్న దనిచెప్పిరి," ఆకాశస్యగుణశ్శబ్దోనిశ్శబ్దోబ్రహ్మఉచ్యతే" అనిశ్రుతియున్నదనిచెప్పిరి, మాట్లాడునదిసగుణమనిన ను, నిర్గుణమనినను, గుణుతెత్తెఁగెడు చైతన్యమునే, మాట్లాడునదియనిచెప్పియున్నారు.

"ఏనవాచాకరోతి" అనిశ్రుతియున్నదని చెప్పియున్నారు. నేనుగుఱుతెఱిఁగెడుచైతన్యమనుజ్ఞానముచేతనే మాట్లాడుచున్నాననియున్నది. గుఱుతెఱిఁగెడు నేను నిర్గుణము. గుఱుతెఱుఁగఁబడిన శరీరాది పదార్థములు సగుణమనిరి. బ్రహ్మసాక్షాత్కారమైన, మొదలుచేయునది సిద్ధము. సర్వకాలము శరీరమును విడిచియుండలేదు, పట్టుకొనియుండలేదు, తనకుఁదానే యాసుకొయ్యవలె తిరుగుచున్నది, తనకుఁదానేస్వాధీనము లేదు, అన్యులకేమి స్వాధీనమగును, ఉన్నట్టే యుండుచున్నది, చూచుచుండఁగా నేమిలేదు గనుక నీశరీరమును నమ్మరాదు, మూలములేని యీగుఱుతెఱిఁగెడు శరీరమను నరకమును విడువలేక, సుఖమనెడుస్వర్గమునకు నాశపడిన దుఃఖప్రాప్తికలిగినయెడల, లింగమూర్తికి క్లేశమే, తనకును మహాక్లేశమే. గుఱుతెఱిఁగెడు మహాలింగమైయున్నాడు గనుక, అందఱును గుఱుతెఱిఁగెడువారే, విష్ణుభక్తులీగుఱుతెఱిఁగెడుచిత్తును. విష్ణువనియును, చిద్రూపమే నారాయణుండనియును జెప్పుటమాత్రమేకాని, స్వర్గనరకములు, లింగమూర్తికి, నారాయణునకు సమానమేను. బియ్యమునకు ననేకపేర్లు యుండుటమాత్రమేగాని, సకలతిప్పలు బియ్యమునకునేలాఁగో యాలాఁగే,మూలములేనియీ గుఱుతెఱిఁగెడు శరీరమును, దప్పించుకొనెడి యుక్తిమెట్టివారికిని గూఢముగానేయున్నది. ఈశరీరము పు

ట్టకమునుపేమియునులేదు. చచ్చినతరువాత నేమియునులేదు. ఉన్న కొంతసేపు లోకవార్తలువిని యనేక భ్రమలచేత ననేకులున్నటులఁ దానునుండి, తుదనుతానేమిలేదు. చచ్చినవారు మఱలపుట్టుదురనుటకు నేమిలేదు. గనుక కలలోమర్యాదలేనటుల యనేకులుతమకుఁదామేతోఁచి, తమకుఁదామే యేమిలేదు, ఇటువంటిదియున్నదని భ్రాంతిపడడమేకాని యున్నట్టుకనఁబడదు. ప్రసూతియైనప్పుడు బిడ్డలకుఁ జంటిమీఁదనాసపుట్టినటుల నివియన్నియును కలఁతవాక్యములే: ఇవియన్నియునిప్పుడు యదార్థముగావినుము. సంసారమనగా మూలములేని యీగుఱుతెఱఁగెడు శరీరమేమిచేసిన నదియే సంసారము, శరీరము లేకమునుపు, కేవలము బట్టబయలుగానేయున్నది. ఈశరీరమేలాఁగువచ్చినదనఁగా, ఇట్టివారివలన వచ్చినదనిచెప్పుటకు ప్రమాణములేదు. శరీరమునకు మొదలేమిలేదు. మొదలుండిన ప్రమాణముండును. మూలములేని యీగుఱుతెఱఁగెడు శరీరమెప్పుడువచ్చెను. ఎప్పుడున్నది. సర్వకాలమీశరీరమున్నదని తెలుఁగదు. మొదలుచెడిన నెప్పుడున్నట్టేయున్నది, వ్యవహారముచాలించఁగానేమియునులేదు.

ఇతి గద్యాః శ్రీమద్గురు శివరామదీక్షిత ప్రభావే, వేదాంతవిచారణే పూర్వభాగే కారణరహితప్రకరణం ప్రథమాధ్యాయః.

సంపూర్ణం.



శ్రీసద్గురవేనమః.

## పూర్వభాగము.

## అహంకారనిరసనప్రకరణము.

శ్లో॥ శుద్ధేసుఖస్వాత్మవిచ । తస్మిన్నాహంకృదాచన ।
తదృత్పదాపియస్యాస్తి । ప్రపంచంనాస్తితస్యవై॥ ౧॥

శ్లో॥ యథానాహంతథాశుద్ధం । తస్మాచ్ఛుద్ధేననిర్ణయః ।
జగదస్తీతిలోకేచ । నాస్తిలోకేనచనిర్ణయః ॥ ౨॥

శ్లో॥ ఆత్మాతీతంకేవలాత్మా । దేహోనాస్తికదాచన ।
అస్తినాస్తీతిలోకేచ । నిర్ణయోనాస్తిసర్వదా ॥ ౩॥

ఈశరీరమునకు మూలములేదు, మూలములేని యీగుణుతెలుఁగుదుననెడి యహంకారమనెడి యెఱుకేమూలము, ఎఱుకేజ్ఞానము, ఎఱుకయనెడుజ్ఞానమేయందఱున్న, అందఱియందు నహంకారమొక్కటేయున్నదిగనుక నొక్కటేయహంకారము. ఈయహంకారముచేత నేకులములు, గోత్రములు. ఇవియహంకారమునకేయున్నవిగనుక, నేనుమాదిగవాఁడను నేనుమాలవాఁడనని ప్రత్యక్షమైనయనుభవము, అహంకారములేకుండిన నిర్ణయములేదు. అహంకారమొక్కటేగాని, దానివ్యాపారములు వేఱువేఱు, అహంకారమునకు వేఱులేదు, బదులులేదు, అన్నిదేహా

ములయందుననొక్కతీఱుగానేయున్నదిగనుక, నేను నేననుట సమానముగానేయున్నది, నేనే యెఱుకయనెడుజ్ఞానము, జ్ఞానమేయెఱుక, ఎఱుకేజ్ఞానము, జ్ఞానముదొడ్డదని శాస్త్రములలోఁ బలికిన, నందఱు జ్ఞానమేగనుక నందఱునొక్కటే. అహంకారములనేకములు లేవుగనుక, అహంకారమే దేవుఁడు, అహంకారములేకుండిన పరబ్రహ్మమునెవరెఱుఁగుదురు, అహంకారమే పరబ్రహ్మస్వరూపము. అహంకారమున్న నన్నియునున్నవి, అహంకారములేకున్న దానితోడ నన్నియును బోయెను. అందఱునహంకారస్వరూపులే, అందఱునహంకారముతోనేయున్నారు, నేను తురకవాఁడననినయహంకారమేయెఱుక, అహంకారము తురకది, నేను నేననెడియహంకారమె హల్లా, అదితురకది,అన్నికులములయందును నేను నేననెడియహంకారమున్నది. అహంకారములేకుండిన నన్నికులములులేకపోవును, అహంకారమేవేదశాస్త్రములను గల్పించినది. అబద్ధమనునదియహంకారమే, నిజమనునది యహంకారమే. అహంకారమువల్లనే వ్యవహారము. అహంకారములేకున్న నున్నదో లేదో నిర్ణయములేదు. నిర్ణయములేకున్న నెవరికిమూలములేదు, అహంకారముచేసిన వేదశాస్త్రములు,అహంకారమునకేప్రమాణములు.

అహంకారములేనివారికి దేనితోనుబనిలేదు. అహంకారమేగురుఁడు, అహంకారమేశిష్యుఁడు. అహంకారమునకేమతములు. అహంకారము శరీరమునొక్కటేను. శరీరము వేఱు, అహంకారము వేఱనియన్నది, అహంకారుఁడైనతాను, శరీరమును వేఱైనయెడల, జంధ్యములుతానేవేసుకోవలయునుగాని, శరీరమునకెందుకు వేయవలయును, తానేలింగముకట్టుకోవలయునుగాని శరీరమునకెందుకుకట్టవలయును, తానేజపముచేయవలయునుగాని, శరీరమేలచేయుచున్నది, తానేచక్రాంకితముచేసుకొనవలయునుగాని, భుజములకెందుకు చేయవలయును, తానేబొట్టుపెట్టుకొనవలయును గాని, శరీరమునకెందుకుబొట్టుపెట్టవలయును, అందువల్ల నేశరీరము వేఱు; తాను వేఱనివాదించుటతప్పువాదము. అదిమాయావాదముగనుక నహంకారములేనివారు శరీరమందులేకనే యున్నారు. అట్టివారే, ఇరువదియైదు తత్వములకునతీతులు, అతఁడేయత్యంతవిలక్షణుఁడు, అతఁడే శ్రీయఃపతి. అతఁడే ఆత్మయనెడు, శరీరములేక యున్నాఁడు, ఈశరీరమం దహంకారములేకయున్నాడు, అతఁడేపరమవస్తువు. కనుక జగద్వచనమేమనఁగా.

శ్లో॥ నారాయణోపరోవస్తు । తస్మిన్నాహంకదాచన ।
గుణత్రయంనవిద్యంతే । వికారరహితస్సదా ॥

ఇదంవస్తునారాయణాత్పరం॥ శే-స్మృ॥ అనియున్నదిగనుక

ఆచార్యకటాక్షముచేతఁగావలయును, ఆచార్యకటాక్షము లేకపోయినయెడల, ఈగుఱుతెఱిఁగెడు చిద్రూపమనెడి యహంకారమయ్యేయున్నది. అహంకారము లేకపోవలయుననియనుకొనుచున్నది. ఇరువదిమొదవదియైన యొఱుకేయహంకారమనెడి యాత్మశరీరములుగనుక, ఆత్మశరీరములురెండు నహంకారమే. ఇరువదిమొదవదియైయున్న యీయొఱుకయనెడియహంకారములేకపోవుటేసరి. ఉన్నయచలమీశరీరములేకనే యున్నది. అదితానుగావలెఁగావలె నన్నది లేకపోయినదిగనుక, కాఁజాలదు. ఈరహస్యము గురువాక్యము లేకఁగుదురదు, ఈయిరువదిమొదవదియైన యహంకారము, సర్వకాలములేనివారేగురువులు. అహంకారముతోడ సర్వమునులేకపోయెను. ఈయొఱుకే సంశయమునకు మూలముగనుక, సకలభ్రమలు నీయొఱుకకే. ఈయొఱుకే కల్పనకుమూలము. ఈయహంకారములేకుండినఁబరమశాంతితానేయగును, గురుమూలముగాఁగావలయును. అహంకారములేని గురుసాంప్రదాయమేకావలయును. అహంకారముతోనేగూడుకొనియున్నవి మతములు, వైదికులు వేదములుసత్యమని నమ్ముటమాత్రమేకాని, వేదోక్తమార్గములహంకారముతోనేగూఁడుకొనియున్నవి. అహంకారములే

కుండిన, వేదములను,వేదోక్తములనెఱుఁగువాఁడెవ్వఁడు. వేదములుమిథ్యయనిన యహంకారమునకేమాని.

అహంకారములేని బసవన్నగారికి, నమ్మాళ్వారులవారికి, స్వామి జియ్యరుగారికి, శంకరాచార్యులవారికి, వీరికందఱికి నహంకారములేదుగనుకనే, రామానుజాచార్యులవారుబ్రాహ్మణకులస్థుఁడయ్యును, రెడ్డికులస్థుఁడగునమ్మాళ్వారులవారికెందుకు దాసుండాయెను, బ్రాహ్మణుఁడు శూద్రునకుశిష్యుఁడెందుకాయెను, గనుక వైష్ణవులు బ్రాహ్మణులుగారు, బ్రాహ్మణ కులస్థుఁడగు బసవన్నగారు లింగబలిజకులస్థుండైన చెన్నయ్యగారికిభక్తుఁడాయెను, గనుక బసవన్నగారును బ్రాహ్మణుఁడుగాఁడు. మనుబ్రహ్మ కమ్మరవాఁడు, గనుక బ్రహ్మసంబంధులు బ్రాహ్మణులుగారు. మనుబ్రహ్మయొక్క సంతతేమానవులు, సర్వము మనుబ్రహ్మయొక్కనిర్మాణమే. మనుబ్రహ్మ కమ్మరవాఁడు, వానిదమ్ముఁడు మయబ్రహ్మ వడ్లవాఁడు, వానిదమ్ముఁడు త్వష్టబ్రహ్మ కంచరవాఁడు, వానిదమ్ముఁడు శిల్పిబ్రహ్మ చిత్రవిచిత్రములుగా బొమ్మలుచేసెడు కాశిపనివాఁడు, వానిదమ్ముఁడు హిరణ్యబ్రహ్మ అగసాలవాఁడు, వీరేదేవతలకుఁదండ్రులు, వీరేమతోద్ధారకులు, వీరే అకారాది దీర్ఘాకారోక్తములు, వర్ణములనుగల్పించినవారు. శాస్త్రనిర్మాణము, అంత

ర్నిర్వాణమున్న మనుబ్రహ్మకల్పనయే. మనుబ్రహ్మకల్పనలేక బొడ్డుతెగదు. అటుతరువాత గొడ్డలిలేనిది పని జరుగదు, బ్రహ్మసంబంధుఁడు బ్రాహ్మణుఁడుగనుక బ్రహ్మమేయెక్కువ. కర్మమువలననిర్వాణము. మతంగమహాఋషి యరుంధతికిఁదండ్రి, శ్యామలాశక్తితండ్రి వ్యాసునికంటె దొడ్డవాఁడు. పుట్టుబ్రాహ్మణులు వేరే, వడుగుబ్రాహ్మణులు వేరే. మనుబ్రహ్మయేసర్వము,మనుబ్రహ్మకన్న నధికులెవ్వరునులేరు. విచారించిననిదేసత్యము, ఈబ్రహ్మమనెడియహంకారములేక సర్వకాలమొకటితీఱుగానున్నవారే భ్రాంతిరహితులు. ఈశరీరముండిన యహంకారమునువదలినవారే భ్రాంతిలేనివారు. సాందీపమహాఋషివంటి, సద్గురుస్వామిసంభవించవలయును, సంభవించినయెడల యీయెఱుకను సర్వకాలములేనటులఁజేయుదురు,చేసినవారే నిజగురువులు.చూచిగుఱుతెఱుఁగునదియేయహంకారము,విననదియే యహంకారము, అనునదియేయహంకారము. మాట్లాడునదియేయహంకారము. భజనచేయునదియే యహంకారము. రుచి, అరుచియెఱుగునదియేయహంకారము. అహంకారమును, ఎఱుకయునొక్కటే. ఎఱుకయేచిద్రూపము, ఎఱుకయేశ్రీమన్నారాయణరూపము. అహంకారములేకున్న చిత్తుండదు. అహంకార

ము లేకున్న నామము లేదు, రూపము లేదు, పరబ్రహ్మము తో భేదము కుండాయెను. అహంకారము లేకపోవుటే ముక్తి. అహంకారము, జ్ఞానము నొక్కటే. అహంకారము లేకున్న జ్ఞానము లేదు. ఈ దేహమందుండిన యహంకారము నువదలుటే సరి.

కైంకర్యము చేతఁగాని, అహంకారము మఱిదేనిచే తనువదలదు. కైంకర్యమే పరమరహస్యము. దేహాభిమానము లేకుండుటే సరి. కైంకర్యమే భక్తిమార్గము. కైంకర్యమునకంటె నధికమేదియును లేదు. గోపికలు కైంకర్యము చేత నేకడ తేరిరి. కైంకర్యమనఁగా కింకరత్వము, స్వాతంత్ర్యమును విడుచుట. ఆచార్యుని కటాక్షము కొలఁదినడచుటే కైంకర్యము. కైంకర్యము చేతనే జన్మరాహిత్యము. దేహ మాచార్యుల వారి శ్రీపాదరక్ష. వారేమియనినను, వారేమి చేసినను, వారి కటాక్షముకన్న నధికము లేదు, వారే సంసారసాగరమును, దాటించువారు, వారి శ్రీపాదతీర్థమును స్వీకరించుటే కైంకర్యము. వారిభుక్త శేషమును స్వీకరించుటే కైంకర్యము. కైంకర్యముచేత నహంకారము పోవును. ఇదే పరమరహస్యము, దీనిచేత నే పరమశాంతి. కైంకర్యమే ముక్తిఫలము. ఆచార్యుని సమ్మతమే కటాక్షము. ఇంతకన్న రహస్యము లేదు. దేహము నాచార్యునకు సమర్పించవలయును. తనుమనోధనములయందు వంచనకూడదు.

చరమశ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్య । మామేకంశరణంవ్రజ
అహంత్వాంసర్వపాపేభ్యో । మోక్షయిష్యామిమాశుచ॥

టీ ॥ హేశిష్య=ఓయిశిష్యుడా, సర్వధర్మాన్=సమస్తముగుధర్మాధర్మములుగలమొలకయనెడి యహంకారమును, పరిత్యజ్య=సమూలముగా నాచార్యునికటాక్షముచేత పరిత్యజించి, మాం=అహంకారములేనినన్నుగురుడనితెలిసి. నాకంటెనన్యుఁడులేడని, శరణం వ్రజ=శరణమునుబొందుము, అహం=అహంకారము లేని నేను, త్వాం=అహంకారస్వరూపుఁడగు చిద్రూపమనెడునిన్ను, సర్వపాపేభ్యః=సమస్తమైనపుణ్యపాపములనుండి, మోక్షయిష్యామి=విడిపించెదను, మాశుచ=నీవు లేకపోవుచున్నావని దుఃఖింపకుమా.

ఈమొలకనాకేమొలక, నేనేమొలుగుదునని యున్నదిగనుక,అహంకారమేజ్ఞానము, అహంకారమేయజ్ఞానము, అహంకారముతోడ సర్వముపోయెనుగనుక, నమస్కారముచేయువాఁడులేఁడు, నమస్కారమే లేదు. ఇదివైష్ణవసిద్ధాంతము.శైవసిద్ధాంతము నిటువంటిదే. వైదీకమాలాగుకాదు,చరమార్గముతోడఁదిరుమంత్రద్వయమునుబడయుట. అహంకారముతోఁగూడనన్నియునుబోయెను. క్షేత్రమైయున్నవాఁడు, మేడిపండువంటివాఁడు,క్షేత్రమునుగుఱించితెలిసెడుక్షేత్రజ్ఞుడనగు నేను

మూలమాయయనెడుపరాప్రకృతివేపకాయవంటివాఁడను. దేహమునుగుఱుతెఱిఁగెనేని, మేడిపండువంటివాఁడను,నేను దేహమునుగుఱుతెఱిఁగినవాఁడనని, నిశ్చయముండిన వేపకాయవంటివాఁడను,ఈ దేహముక్షరోపాధి. ఈదేహమునుగుఱుతెఱిఁగెడు నేనక్షరోపాధి. ఈరెండైనను, రెంటిలోనొకటియైనను,తాననియున్న వాఁడు పతితుఁడు. ఈరెండునుదోషస్వరూపములు.ఈరెండును ప్రకృతిద్వయము. ఈరెండును ప్రకృతిపురుషులు. ఈరెండును సగుణనిర్గుణములు. ఈరెండును విద్యావిద్యలు. ఈరెండును సదసత్తులు. ఈరెండును బీజజడములు. ఈరెండును సుఖదుఃఖములు. ఈరెండును జ్ఞానకర్మములు. ఈరెండును సకలయజ్ఞములు. ఈరెండును సకలయోగములు.ఈరెండును సకలయాత్రలు.ఈరెండునుసకలచదువులు.ఈరెండునుసకలనీమములు.ఈరెండునుసకలయణిమాదులు. ఈరెండునుబ్రహ్మత్వాదిపాతకములు. మేడిపండువంటిక్షేత్రమున్ను,వేపకాయవంటిక్షేత్రజ్ఞస్వరూపుఁడున్ను, ఈరెండునున్నవని లోకులువినియును,చూచియును,ఎఱిఁగియును,తామునిర్ణయము చేయుచున్నారు. అందఱునీరెండుతప్ప, వేఱొకటియైన యచలమునువిననివారు, ఎఱుగనివారు, చూడనివారుగనుకనే, కలతఁజెందియున్నారు. 'గుణములవి

చ్ఛలవిడిగాఁబఱుగెత్తునపుడు తల్లిబిడ్డనుబట్టక, తల్లినిబిడ్డపట్టక, తండ్రికొడుకునుబట్టక తండ్రిని కొడుకుపట్టక నెక్కడివారక్కడనే నిశ్చేష్టితులై యున్నారు, ఇంతేకాని మఱియొకటిలేదు. చలిలేనివణుకులెందుకు. అట్టియచలమునుబొందుటకు, నిజగురుకృపయే కారణముగాని, వేదశాస్త్రములచేతఁగాదు. శ్రవణాదులచేతఁగాదు. గురుదేవతాత్మైక్యజ్ఞానతత్పరముచేతఁగాదు. సమ్యగ్దర్శనము మోక్షసాధనముగనుక, గుఱుతెలిఁగెడు చైతన్యమునేనని నిశ్చయముండిన వేపకాయై యున్నట్టు. ఇందుకు ప్రపంచదేహములు మేడిపండువంటివి, ఈదేహమును గుఱుతెలిఁగెడి యాత్మస్వరూపుఁడగు చైతన్యమైననేను, వేపకాయవంటివాఁడను. ఈరెండునులేని, నిజగురుస్వాములవారిసాంప్రదాయమునుగనిపట్టి, ఈమేడిపండును, వేపకాయను, దినుటకువాటిజాడగనుగొని, సర్వకాలమొక్కరీతిగానుండిన, భ్రాంతిపుట్టనేరదు. మేడిపండునువిడువఁగూడదు. వేపకాయగాఁగూడదు. మేడిపండును బుట్టించునది వేపకాయ, మేడిపండును విడుచువాఁడనే నేను, ఇందుకొఱకు మేడిపండును విడువవద్దు, వేపకాయగావద్దు. విచారించిన, విచారించకుండిన,నీరెండునుమధ్యవచ్చిమధ్య

నేపోచున్నవి. ఈరెంటినివిడనిది, చూడనిది, ఎఱుఁగనిది, లోపలవెలుపలయను మర్యాదలేనిది, సర్వకాలమొకరీతిగానేయున్నది. అట్టియచలము జ్ఞానకర్మములుచేయనిది, చేయించనిది, విననిది, నేనుగురుఁడను, నీవుశిష్యుఁడవని భావనలేనిది, సంకల్పవికల్పములులేనిది. సంశయములుపుట్టనిది.మానావమానములులేనిది. చూపులేనిదియైన యచలముగనుక, నదియే పుట్టని చావనిది. అట్టిపరిపూర్ణము, మేడిపండువంటి శరీరమైయున్నవారికిని, నేనునేనని యద్వైతవాదము చేసెడువారికిని, చైతన్యమున్నవారికిని దొరకదు.

ఇతిగద్యా ॥ శ్రీమద్గురుశివరామదీక్షితప్రభావే.

వేదాంతవిచారణే,పూర్వభాగే. అహం

కారనిరసనప్రకరణం.

ద్వితీయాధ్యాయః

సంపూర్ణం





శ్రీసద్గురుభ్యోనమః

## పూర్వభాగము.

## చైతన్యనిరసనప్రకరణము.

ఎప్పటియచలమేకాని, ఏసాధన, ఏశ్రుతి, ఏయుక్తి, ఏయనుభవము పనికిరాదు. మొదలుకొనలేక స్వతస్సిద్ధమైయున్నదిగనుక యున్నదేయున్నది. అదే యచలము. రెండవదియైన మాయా చైతన్యమునకు మూలములేదు. కాఁబట్టి యీభూమండలమందు, భ్రాంతిలేకయున్నవారెక్కడనైనను గలరాయని యవశ్యము వెదుకవలయును. అటులవెదకి కనిపట్టక మూలములేని యీగుఱుతెఱిఁగెడిశరీరము నేనని, సమ్మియున్నను లేక గుఱుతెఱిఁగినను, ఎముకతినెడు కుక్కవలెపడిపోవును, బాహ్యమందు గుఱుతెఱిఁగిన, పందివలెపడిపోవును, వైరాగ్యముచేతసన్యసించితిరిగిన గుఱుతెఱిఁగెడు గాడిదెవలెపడిపోవును. యోగాభ్యాసముచేసితిరిగిన, గుఱుతెఱిఁగెడు దొమ్మరవానివలె, సాధించి యొకనాటికిఁజచ్చును. వాయుధారణచేసిన, గుఱుతెఱిఁగెడు పామువలెపడిచచ్చును. కర్మములుచేసిన గుఱుతెఱిఁగెడు చాఁకలవానివలెను, మంగలివానివలె

ను, కుమ్మరవానివలెను, సాలెవానివలెను, మాదిగవానివలెను, పంచబ్రహ్మలవలెను, మేదరవానివలెనుజచ్చును. ఏమిచేసినను మూలములేని యీగుఱుతెఱఁగెడుశరీరమేమి లేదని నిశ్చయమైనవాఁడే యచలుఁడు. ఈగుఱుతెఱఁగెడుశరీరమేమి లేదు. సర్వాకాలమెడతెగక నిద్రవచ్చువరకుప్రతిదినము మఱువకఁజచ్చునంతవరకు నభ్యాసముచేసితిరిగిన, పుట్టనిచావని యచలమేకాని, మఱియొకటికాదు. ఇదినమ్మినవారికి రాఁకపోఁకలులేవు. ఇదిగాక, మూలములేని యీగుఱుతెఱఁగెడు శరీరము చేసినమరియాదనుదెలిసిన, గుఱుతెఱఁగెడు పెద్దపులివలె చచ్చును. మూలములేని యీగుఱుతెఱఁగెడు శరీరముచేసినదేదియును నమ్మరాదు. నమ్మిన యెడల సంకిళ్లుతగిలినట్లు, మోక్షభ్రాంతియైన, బంధభ్రాంతియైనతగిలి, శాస్త్రవాసనచేత, లోకాంతరాగమనమైనతగిలి, దానిచేనెంతటివాఁడైనను, నరకమనే శరీరమునువిడువక, మునుగుచు తేలుచుండును. సుషుప్తియనెడి యంధకారములో, సుఖమనెడుదురాశచేత మూలములేని యీగుఱుతెఱఁగెడు శరీరముతప్పినను, విడువకనుండునట్లు, ప్రాణధారణ కల్పాద్యౌషధములచేత, కాయసిద్ధియైనదని, నేనుదాఁటుకనని చెప్పుచు, గు

ను తెఱఁగడియేనుగువలెపడిచచ్చును. కాబట్టిశీఘ్రము
గ నీగుఱు తెఱఁగడుశరీరము లేనియచలస్వరూపుఁడగుస
ద్గురుస్వామిని వెదకి కనిపట్టి, వంచనలేక సేవచేసి, వారి
యెంగిలితినకుండా క్రియాశూన్యమేలాఁగు, వారింట
భోజనముచేయకపోవుటేలాఁగు, జన్మరహితమేలాఁగు.
ఈగుఱు తెఱఁగడుశరీరమునకు నాధారమెవ్వరు, సకల
నియమములు, ధర్మాధర్మములు, పుణ్యపాపములుచేసి
నవారెవ్వరు. ఈపగిదియడిగి తెలుసుకొనవలయును.
చెప్పశక్యముగాని ప్రశ్నలును, గ్రంథములునెవ్వరుచే
సిరి, పుట్టనిచావనియచలముచేసినదా, మూలములేని
యీగుఱు తెఱఁగడుశరీరముచేసినదా, ఇదియొకప్రశ్న.
పుట్టనిచావనిదియొకటి, చచ్చునది పుట్టునది మఱియొ
కటియున్నదా. ఇదియొకప్రశ్న.జగద్భ్రాంతియెవరికివ
చ్చినది, యెవరికిపోవుచున్నది. ఒక్కటేయనికొందఱ
నుచున్నారు. ఆయొకటి యెట్టువంటిది, అదియెక్కడ
నున్నది. అది నేను నొక్కటనిచెప్పుచున్నారు. పుట్టు
వాఁడను జచ్చువాఁడనునేనై తిని. పుట్టునది చావునది
యదియనెను. అదికాతే, ఇదివేఱేనా, అది, ఇది యొ
క్కటేనా. ఎవ్వరును భ్రాంతిపుట్టకుండునట్లుఁజెప్పరు.
ఏభాష్యములును భ్రాంతిరహితమును జెప్పలేదు. ఎటు

వంటివారికినిఁజెప్పఁగానే,భ్రాంతిపోవద్దా.నిప్పుదగ్గిరకుంబోయినఁజలిపోయినట్లుండవలయును. దాహమునకుంబుచ్చుకొనినందాహముతీరినట్లుండవలయును. ప్రయాణమునడిచి యింటికివచ్చిన నాయాసముతీరినట్టేయుండవలయును. భోజనముచేసిన యాఁకలితీరినట్లుండవలయును. అన్నిసరేకాని,దాఁటించువాఁడు ఘట్టివాఁడుగనుండవలయు నటులఘట్టివాఁడుసంభవించినను,దాఁటువాఁడు సద్గురుఁడుచెప్పినటుల వినవలయును. అటులవిన్నక, మీఁదనుండి క్రిందికిదుముకువాని నేమిచేయవచ్చును. వానికేభయముండవలయును. సర్వకాలముగురుసేవచేయవలయును. భార్యసేవ,కొమారులసేవ, ప్రభువులసేవ, చేయుచుండిన గురుకటాక్షము కలుగదు. దీర్ఘకాలము గురుసేవచేతగాని భ్రాంతిరహితము కాదు.

భ్రాంతిరహితమయ్యేయుక్తియద్వైతమే, గుఱుతెఱిఁగెదు చైతన్యమునీవనియన్నట్టుకాదు. నీవువేఱు,ఈశ్వరుఁడువేఱనియన్నట్టుకాదు. ద్వైతమున్నది,యద్వైతమున్నదనియన్నట్టుకాదు. అంతయుచైతన్యమనుజ్ఞానముకాదు. గుఱుతెఱిఁగెడువాఁడనుగనుక, అపరోక్షజ్ఞానమువంటిది కానిదేయవలయు. గుఱుతెఱిఁగెదువిశిష్టమున్నట్టుకాదు, గుఱుతెఱిఁగెడుజ్ఞానమే బ్రహ్మమన్న

ట్టుకాదు. ఈగుణు తెలిఁగెదుదృక్కు-కాదు. గుణుతెలిఁగెదుసాక్షినియన్నట్టుకాదు, నీవుగుణుతెలిఁగెదువాఁడవన్నట్టుకాదు, బంధమనిభయపడుచున్నట్టుకాదు, గుణుతెలిఁగెదుశరీరమేమిలేదనిచెప్పి సమాధానము చేసేవారుదుర్లభము, ఈశరీరమునకు మూలమున్నదనెడుమూర్ఖులువిస్తారము. స్వప్నమునకును, దేహమునకును, మూలములేనటుల, ఈగుణుతెలిఁగెదుశరీరమునకుమూలములేదు. ఎంతటివారికినిఁదెలియదు, మూలములేనియీగుణుతెలిఁగెదు శరీరమే నాకు మూలమున్నదనియన్నదిగనుక, నాకునేనే మూలమున్నదనియనుకొన్నాను. ఆహా! పుట్టనిచావని మొదలుతుదలేని యచలముగనుక నట్టియచలపరిపూర్ణమునావంటిదికాదు. నాజోలేదానికిఁబట్టదు. మొదలులేనినాకు నేనేయచలములోనుండి, వింతలనుజేయుచు వేదశాస్త్రములనుగల్పించుచు, నానాయవతారములెత్తుకొనుచు, సూత్రధారివైనటనఁజేయుచున్నాను. నామూలమెవ్వరెఱుఁగరు, నేనుఱాతినిదేవుఁడని ప్రతిష్ఠించి తీర్థములుసాధించుచున్నాను, కట్టెను దేవుఁడని కైవారముచేసియందఱినియీడ్చువాఁడను నేనేను. రాజుబాదరాజునకేతెలియదు, లోకులకేమి తెలియును. నాకునేనేగాని, నాకెవరితోనుబ్రయోజనములేదు. నాకునేనేవచ్చెదను

నాకునేనేయుండెదను. నాకునేనేయేమిలేదు. నాకునేనే మూలము. నేనుసముద్రములోఁజేఁపయున్నట్లున్నాను. మొదలుకొనలేనియచలముపుట్టదు, పుట్టించదు, చావదు. సర్వకాలమొకటేవిధముగానున్నది.మూలములేని యీగుఱుతెలిఁగెడుశరీరమున్నయున్నట్లున్నది. భ్రాంతిరాహిత్యమునుజెప్పెడుగురుఁడు సంభవించుటదుర్లభము. భ్రాంతిలేనిసద్గురుఁడెక్కడున్నాఁడని, అదివేదశాస్త్రములచేతనవునే కానని, ఈగుఱుతెలిఁగెడు శరీరమే సర్వము నన్నదనినిశ్చయించుచున్నారు. దీనికి సర్వకాలమువికారముతప్పదు. సమస్తము మూలము లేనియీగుఱుతెలిఁగెడు శరీరమేచేసినదిగాని యచలమేమియునుజేయలేదు. మూలములేని యీగుఱుతెలిఁగెడు శరీరమునకేసర్వమును దోఁచుచుండును, ఈగుఱుతెలిఁగెడు శరీరమేమిలేకపోయిన నేమిలేనియచలమేస్వతస్సిద్ధమైయున్నది. ఐనను మూలములేని యీగుఱుతెలిఁగెడుశరీరముయొక్క స్వాతంత్రమునువిడువఁగూడదు. ఈమూలములేనిగుఱుతెలిఁగెడు శరీరమేమిలేదు. ఇదేషోడశాక్షరీమంత్రము. ఇదివిడువవద్దు. ఆవరణాంతముండవలయును, ఉండినయెడల, పుట్టనిచావనియచలము స్వతస్సిద్ధముగానున్నది, దానికిమొదలుకొనలేదు. సర్వకాలమొక్కటేవిధముగా నున్నది.

అచలమెందుననిండియున్నదని, మూలములేని యాగుఱుతెఱిఁగెడు శరీరమునకుదృఢమైనయెడల, స్వతస్సిద్ధమైపుట్టని చావనియచలము, సకలదేశములయందు. సర్వకాలములయందు, సమస్తవస్తువులయందు. జ్ఞానకర్మములయందు నేమియునెఱుఁగక దనకుఁదానే యున్నది, మూలములేనియాగుఱుతెఱిఁగెడు శరీరమేమిలేదు. ఇట్లుసంతతమభ్యాసముచేసినయెడల నొక్కటియైనబాధయుండదు. ఉన్నదేయున్నది,అదిచావుపుట్టుకలులేనిపరిపూర్ణముగనుక,దానికిరాఁకపోఁకలులేవు.

కలలోనొకముత్తైదువస్త్రీపుట్టెను. ఆముత్తైదువునువెదకుచు నొకమూలములేని పురుషుఁడువచ్చెను, ఈయిరువురు తల్లిదండ్రులు లేకనేవచ్చిరి, ఈయిరువురయోనిసంభవులు, ఆస్త్రీని నీపేరేమని పురుషుఁడడిగిననదిప్రకృతియనిచెప్పెను. ఆపురుషుని నీపేరేమని స్త్రీయడిగిన నతఁడుపురుషుఁడనిచెప్పెను. నీకులమేమనియడిగిన, నీకులమేమనియనెను. నాకుఁదల్లిలేదని ప్రకృతిచెప్పెను. నాకుఁదండ్రిలేఁడని పురుషుఁడుచెప్పెను. నాస్వరూప మీ మూలములేని గుఱుతెఱిఁగెడిశరీరమేకాని, మఱియొకటికాదని ప్రకృతిచెప్పెను. మూలములేని యాగుఱుతెఱిఁగెడిశరీరమే నాస్వరూపమని

పురుషుఁడుచెప్పెను. అట్లయితే, ఈగుణములతోఁగూడిశరీరమే, నీకు నాకు నెక్కువతక్కువలుగాని, మనమిద్దఱము మూలములేనివాండ్రమేను. నీకుశరీరములేదాయని పురుషుఁడడిగెను, నేనువేఱే, శరీరమువేఱేయని ప్రకృతి చెప్పెను. అట్లయిన, సుఖదుఃఖములు నీకా శరీరమునకాయని పురుషుఁడడిగెను. శరీరము సుఖదుఃఖములనెఱుఁగదు, నాకులేనేలేవనిచెప్పెను. అట్లయినప్రకృతివేఱే, పురుషుఁడువేఱేనా, ప్రకృతిపురుషుఁడొక్కటేనాయని పురుషుఁడడిగెను. నాశరీరమేప్రకృతి, నేనే పురుషుఁడను, నావంటివారేయుండఱనిచెప్పెను. అట్లయితే నీవును నేనునొక్కటేనా. నీకునీవే, నాకునేనేయనెను. అనఁగానే, మంచిదని పురుషుఁడు మాయమాయెను. ఈప్రకృతి యెక్కడచూచిననేమిలేదు. ఎక్కడవెదకిననెక్కడను జాడదొఱకకఁబోయెను. అంతటఁదనకుఁదానే తపస్సుచేసెను. చేయుఁగానేపురుషుఁడువచ్చి, నీవెందుకుతపస్సుచేసెదవనియడిగెను. అప్పుడుప్రకృతినీపేరేమనియడిగెను, నాపేరుగురుఁడనెను. గురుఁడనఁగానేమనియడిగెను. చెప్పెదనుగాని, నీపేరేమని గురుఁడడిగెను. నాశరీరముప్రకృతి, నేనేపురుషుఁడననిచెప్పెను. ఈలాగునీవే పేరుపెట్టుకొంటివా, లేకయెవ్వరైనఁబెట్టిరా, నీకేమైనసంశయముకూడాయునియడిగెను. నరేకాని, ఈశరీరమ

నెడుప్రకృతికిని, నేననెడు పురుషునకును గొంచెమైన సంబంధమున్నదా, లేదాచెప్పుము. సంబంధమున్నద నినేననుకొన్నాను, నేనెఱుంగను. ప్రకృతియనెడుశరీర మునకంటెను, పురుషుఁడనెడు నీకంటెను, అధికమున్న దాలేదా. నన్నునేనెఱుఁగను, నాశరీరమనెడు ప్రకృతి యెఱుఁగదు, ఈరెంటికంటెనధికమున్నదని యెఱుఁగన నిచెప్పెను. అట్లయిన నీకునీవేస్వతంత్రుఁరాలవా, నీకు మూలమున్నదాయనియడిగెను. నాకుమూలమున్నద నియెఱుఁగను, అధికమున్నదనియెఱుఁగను, నన్నునేలా గైనఁగడతేర్పుమనెను. అట్లయితే నీకేమిచింతయని యడిగెను. మీపేరు గురుఁడంటిరే, అదియెటువంటిదో యనిచింతయొకటి, నామూలమునాకుతెలియదనే చిం తయొకటియనెను. అట్లయినఁ జెప్పుచున్నానువినుము, నేనునీకొఱకేవచ్చినాను, నేను బుట్టనిచావనివాఁడను, నాకు పేరులేదు, నేనకస్మాత్తుగా వచ్చినాను, నీవుత పస్సు చేసినందున, నేనునీకు శాంతిజాడ చెప్పుటకై వచ్చితిని, నాకుసర్వకాలము మూలములేని యాగుఱు తెఱిఁగెడిశరీరములేదు. నీకుజాడయున్నట్టియున్నది, ఇ దియేమియాశ్చర్యము, నాకుఁదెలియదనెను. ఐతే తెలి పెదనువినుము. నీవెప్పటికినొక్కటియుగానున్నావా, లేక

కొంతసేపు, ఇంకొకతీఱుగానున్నావాయని యడిగెను, నిద్రవచ్చిననేనిద్రపోయెదను. మేల్కన్ననేమేల్కనెదను, కలగనిననేకలగనెదనని చెప్పెను. ఈమూఁడునుశరీరమునకా, నీకాయనియడిగెను. నేనేమిలేదు నిద్రవచ్చినశరీరమునిద్రపోచున్నది, కలగనినశరీరము కలగనుచున్నది మేల్కన్నశరీరము మేల్కనుచున్నది, నన్నువిడిచిశరీరముండదుశరీరమునువిడచినేనుండను. నిద్రపోయిననన్ను నేనెఱుఁగను, శరీరమునెఱుఁగను. అట్లయిన శరీరమునునీవునువేఱైముచ్చట్లాడుచున్నావా, అదేమిలేదు, నేను, శరీరము నొక్కటేను మునుపేమోనని యనుకొన్నాను. నేనేభ్రమసిరెండుపేర్లుపెట్టుకొన్నాను. పూర్వమునేనేమెఱుఁగను. ఒకమగవాఁడువచ్చి, నీవుప్రకృతివా, పురుషుఁడవాయనియడిగెను. అవిరేండేమని, నేనేశరీరము నేనేప్రకృతి, నేనేపురుషుఁడననియంటిని. ఆహా! సంతోషమే. ఇంతేకదా, ఇఁకమీఁద జాగ్రతగావినుము.

మొదలుకొనలేనియచలమున్నది దానికినుత్పత్తిస్థితిలయంబులులేవు పుట్టనిచావనిదానికేమియునులేదు ఇదియందఱికిసమాధానము, సరేకాని, అదియెక్కడయున్నది? శీఘ్రముగాసూచనఁజేయుదు నెనెప్పుడెప్పుడోయనిచింతించుచున్నాను, అదిసాధ్యమా, అసాధ్య

మా! స్వామీ! మీ రేలాగున గనుగొంటిరని యడిగెను. నాకును నీవలె నపేక్షకలిగియుండగా నొకయాడుది వచ్చి తెలిపెను. తరువాత నమస్కారము చేసెదమన్న నేమిలేదు. కేవలయచలమేకాని, రెండవదిలేదు. ఆలాగే నాకును శీఘ్రముగఁ దెలుపుడు. మంచిది వినుము. కలలో నేనుఁగు వచ్చి పంద్రెండేండ్లుండి యేమిలేకఁబోయెను. వెంటనే కోట్లకొలఁది లొటిపిటలు వచ్చి నూరేండ్లుండి యేమిలేకఁబోయెను. తర్వాత యీభూమండలమం దనేక సముద్రములు, మహాఋషులు మునులు, యోగీశ్వరులు చిత్రవిచిత్రములైన గుఱ్ఱములు, బంగరుపల్లకీలు వెండిపల్లకీలు, పెక్కుకృష్ణావతారములు, ఏబదికోట్లు రామావతారములు, నూరుకోట్లు సీతలకు లెక్కలేదు. ముండలు నూరుకోట్లు. అడవియంతయును గోపికలే. వచ్చునప్పుడెక్కడనుండి వచ్చెనో. మనుష్యులకు మనుష్యులు, గుఱ్ఱములకు గుఱ్ఱములు, గాడిదలకు గాడిదలు, కుక్కలకుఁ గుక్కలు పందులకుఁ బందులు, ఏనుఁగులకు నేనుఁగులు, లొటిపిటలకు లొటిపిటలు, అనేకములీ చొప్పున నేబుట్టి, అనేకదినములుండి, చూచుచుండఁగా నేమిలేకపోవును. ఈలాగుననే, సర్వము వచ్చుటయు నుండుటయు, మేలుకన్న నేమియును లేదు. ఇటువలెనే, నీరాఁకడ, నీయునికి, నీపోఁకడ యని చెప్పెను. స్వామీ! పుట్టని చావని యచలము

యొక్క జాడ చెప్పుడు. అదియసాధ్యమెంతటివారికిని దె
లియదు. నీకునేలాగున దెలిసెననగా, సూచనఁజేయఁ
గానేయదేయున్నది. స్వామీ! నాకునాలాగుననేసూచ
నఁజేయుఁడు. పుట్టనిచావనిదిసకలదేశములయందును,
సర్వకాలములయందును, సమస్తవస్తువులయందును,
చలించకనొక్కతీరుగానేయున్నదనెను. అట్లైననాకు
వేఱేయున్నట్లున్నది. అదినేనేలాగు కానవియనెను. నీ
వదియెన్నటికినిఁగావు, నీవదిగావు అదినీవుగావు, అది
యదే, నీవునీవే, నీకునుదానికిని, చాలాహెచ్చుతక్కు
వలున్నవి, అదిమొదలుకొనలేనిది, నీకుమొదలుతుద
లున్నవి. అదియుత్పత్తి, స్థితి, లయములులేనిది. నీకు
నుత్పత్తి, స్థితి, లయములుగలవు. గనుకనీకును పరి
పూర్ణమునకును జాలా హెచ్చుతక్కువలున్నవని చె
ప్పెను. స్వామీ! సరేకాని యున్నదున్నట్టు చూడఁబ
డెడియుక్తిసూచనఁజేయుఁడు. నన్నేలనింత కష్టపెట్టె
దరుశీఘ్రముగాఁజెప్పుడు. దరిద్రుఁడుధనవంతుడైన,వా
నికిఁబ్రియమువిశేషము, ఆలాగుననేతమరుశ్రమపడిసా
ధించినారుగనుక శీఘ్రముగాదయరాదు. ఈభావము
నునమ్మునో నమ్మఁడోయనిసందేహించి చెప్పుకున్నారు.
నాకంతకఠినమైనహృదయములేదు. ఉన్నదున్నట్టుగాఁ
జెప్పిన, సంతోషమనిపలికెను. నీకుతీవ్రముమహాలాగ
నిగురుఁడుచెప్పెను. స్వామీ! మూలములేని యీఁగు

ఊ తెలియఁగెడుశరీరము మెఱుగుడుపువ్వువంటిది, లేకమేఘమువంటిది, మెఱుపువంటిది, ఱెప్పపాటుకంటే శీఘ్రముగాబోవునది. కాఁబట్టి కలలోవచ్చినశరీరమేమాయమనుజెప్పుమనెను. ఏమాయనినీవేచెప్పుము? మూలములేనిదిగనుక నేమియును లేదు. ఈగుఱుతెలియఁగెడిశరీరమునకు మూలమున్నదా! లేదు. అదియేమి? అదేమియు నేమి రెండునుయెక్కఁడేను. మూలములేని యీగుఱు తెలియఁగెడి శరీరమేమియు లేదు. మూలములేనిదిగనుక నిటువంటి మూలములేనిశరీరము వచ్చిననేమి లేదు. కలలోవచ్చిన శరీరమేలాగుననేమిలేదో, ఆలాగుననే మూలము లేని యీగుఱు తెలియఁగెడిశరీరమేమియును లేదు, సర్వమును గుఱు తెలియఁగెడు శరీరమేలాఁగో, ఆలాఁగుననే, పుట్టని చావనియచలముతనకుఁదానే స్వతస్సిద్ధమైయున్నది, అసాధ్యమేమియును లేదు, ఏసాధనలేకపరిపూర్ణముస్వతస్సిద్ధముగానున్నది. ఆహా! ఏమియాశ్చర్యము, జ్ఞానశాస్త్రములు, సకలభాష్య సిద్ధాంతములెక్కడఁబోయెనన్న, మిగులఁజిత్రముసరేకాని, ఎంతటివాఁడైననుమూలములేనియీగుఱుతెలియఁగెడి శరీరమేమిలేదని, సంతతముమఱువకనుండ వలయును, ఉండకపోయినయెడల భ్రాంతిపుట్టుచున్నది, అశ్రద్ధకూడదు ఇంతకంటెనెక్కువలేదు ఇటువంటివానికిఁ బుట్టనిచావనిది సకలదేశములయందును, సమస్తవస్తువులయందును, చలిం

చక మొదలుతుదలులేక, తనకుఁదానే స్వతస్సిద్ధముగా నున్నది. అదితానుగావలెననియాశలేదు, ఐతిననియాశలేదు, సర్వకాలమొకటేవిధమునన్నది గురుకటాక్షముచేతననాయాసముగాఁబొందవచ్చును,ఒకటియైన భ్రాంతియుండదు, చేసిన విడిచిన, నూరకుండిననొకటేప్రకారము గానచలము చలించదుగనుక, అదేయున్నది మూలములేనియోగులు తెలిఁగెడిశరీరమేమియు లేదు, కలలోవచ్చినశరీరము మేల్కన్న నేమియును లేదనినిశ్చయమైనయెడలనదే గురువాక్యము.సర్వకాలము శరీరములేనియచలము మాత్రమున్నదనునదే విచారణ

ఇందుకుజ్ఞాపకము.

శ్లో॥ అశరీరంసర్వదాస్తి । శరీరరహితంసదా।
ఇదమేకంసద్యోముక్తి । స్సర్వదాభ్రమవారణా ॥

అనియున్నదిగనుక, మూలములేని యోగులు తెలిఁగెడిశరీరమేమిలేదు, ఇదిరాకమును పునచలమేయున్నది. ఉన్నప్పుడు నచలమేయున్నది, చచ్చినప్పుడునచలమేయున్నది. మూలములేనియోగులు తెలిఁగెడి శరీరమేమిలేదు. కోటిమార్గకునిదియేజ్ఞాపకము, ఇంతకంటెనెక్కువలేదు, దీనినిమఱువవలదు, కలలోనిశరీరము మేల్కన్న నేమియులేదని, నిశ్చయముండ వలయును. ఈలాగైన నిస్సందేహముగాభ్రాంతిరహితమని యచల సాంప్రదాయకులకే తెలుసును॥

ఇతిగద్యా॥ శ్రీమద్గురుశివరామదీక్షితప్రభావే వేదాంతవిచారణే, పూర్వభాగే చైతన్యనిరసనప్రకరణం తృతీయోధ్యాయః. సంపూర్ణం.



శ్రీసద్గురవేనమః.

## పూర్వభాగము.

### క్షేత్రక్షేత్రజ్ఞప్రకృతిద్వయనిరసనప్రకరణము.

క్షేత్రక్షేత్రజ్ఞలక్షణ ప్రకృతిద్వయదోషరహితమేయకర్మము. ప్రకృతి ద్వయదోషరహితమే సువ్రతము. ప్రకృతిద్వయ దోషరహితమే పుణ్యపాపరహితము. ప్రకృతిద్వయదోషరహితమే ధర్మాధర్మరహితము. ప్రకృతిద్వయదోషరహితుఁడుచేయఁడు, విడువఁడు, అందఱివలెనేయుండును గనుకనతనిజాడ తెలియఁబడదు. ప్రకృతిద్వయదోషరహితుఁడుచేయును, చేయఁడు, విడిచిపెట్టఁడు. అందఱికన్న నెక్కువగానేజేయును గనుక ప్రకృతిద్వయదోష రహితులకుఁ బట్టువిడుపులులేవు. సర్వకాలము దోషరహితమే స్వభావము. క్షేత్రక్షేత్రజ్ఞలక్షణ ప్రకృతిద్వయదోషరహితమే సర్వము. ప్రకృతిద్వయదోషరహితమే పరమార్థము. ప్రకృతిద్వయమే వేదశాస్త్రములనుగల్పించినది. ప్రకృతిద్వయదోషసహితులే వ్యాసాదిమహాఋషులు. ప్రకృతిద్వయదోషరహితమైన యచలమున్నదనివారెఱుంగరు. ప్రకృతిద్వయదోష రహితులుసామాన్యజనుల వలెనేయుండి, దోషద్వయములేనియచలము యొక్కసూచనను నిజగురుకటాక్షంబున సంపాదించుకొని మెదలుమన్నారు. దోషములేనివారని యేలాఁగునదెలుసుకో

సవచ్చునననఁగా, వారికి రాగద్వేషములు లేవు, మూర్ఖము లేదు, సమయోచితప్రజ్ఞగలవారు. దేహాభిమానరహితులు. శాస్త్రాభిమానముండదు, ఐననులోకానుగుణ్యముగనటించేవారు. స్వదృష్టిచేతనున్నారో లేదో. అన్యులదృష్టిచేతనున్న దేయున్నది. గురుగింజలబంతినినూతనముగఁజూచినవారు మండుచుండెడునిప్పనుకొనుచున్నారు, వారనిసమాత్రమున నేయది కాలినదికాదు. విచారించనివారిమాటగనుకనది గురుగింజలబంతియేగానిమండుచుండెడు నిప్పుకాదుగదా. అటువలెనేప్రకృతిద్వయదోష రహితులు చేయునట్టి వ్యాపారములన్యులచేతఁగల్పితములు. ప్రకృతిద్వయ దోషరహితులుచూడరు. వినరు, మాట్లాడరు, కదలరు, మెదలరు, తినరు, తెప్పపాటంతైనక్రియలేదు, సర్వకాలమునుపాధిద్వయదోషరహితులుగనుక నిదియేరహస్యము. ఈరహస్యము లోకమునందు దుర్లభము. ప్రకృతిద్వయదోషరహితులకు వేదశాస్త్రములతోఁబనిలేను. అజ్ఞానులకుఁ గర్మకాండప్రమాణము, జ్ఞానులకు జ్ఞానకాండ ప్రమాణము, ప్రకృతిద్వయదోషరహితులుజ్ఞానులుగారు, అజ్ఞానులుగారు గనుకవీరికివేదశాస్త్రములు పనికిరావు. వేదములువెఱ్ఱివాక్యములు, అవికర్తలేక నేకర్మమును బోధించుచున్నవి, ఈదబ్బరయైనజ్ఞానమేదొడ్డదనిచెప్పుకొనుచున్నది, ఈవాక్యములనేలాఁగునమ్మవచ్చును, ఎవరుకర్త, జ్ఞానమే యజ్ఞాన

మాయెను, కర్తయే యకర్తయాయెను, ఇదియేమివింత, భగవద్వాక్యములు, ఆచార్యస్వాములవారి వాక్యములు సాకర్యమాయెను. ఇదియే పరమ రహస్యము. క్షేత్ర క్షేత్రజ్ఞలక్షణ ప్రకృతిద్వయాఖ్యోపాధి దోషరహితమే పరమపదము.

శ్లో ॥ క్షేత్ర క్షేత్రజ్ఞయోరన్యం నామరూపవివర్జితం।
సదా త్రిపుటీరహితం సర్వద్వంద్వవివర్జితం ॥

త్రిపుటియనఁగా=జ్ఞాత జ్ఞానము జ్ఞేయము. ఇవియే త్రిపుసహితము. ద్వంద్వములనఁగా=సత్తు,అసత్తు.చిత్తు,జడము సుఖము,దుఃఖము. క్షేత్రము, క్షేత్రజ్ఞుఁడు.జ్ఞానము అజ్ఞానము. విద్య, అవిద్య. కారణము, కార్యము. ఆత్మ, అనాత్మ. ప్రకృతి, పురుషుఁడు. సాకారము, నిరాకారము. సగుణము, నిర్గుణము. కర్మము, జ్ఞానము. ధర్మము, అధర్మము. పుణ్యము, పాపము. పతివ్రత, వ్యభిచారి. ముండ, ముత్తైదువ. బంధము, మోక్షము. గృహస్థుఁడు, వానప్రస్థుఁడు. అహితాగ్ని, అనాహితాగ్ని. బాలింతరాలు, గొడ్రాలు. మంచివాఁడు. చెడ్డవాఁడు. కాఁబట్టిగుణు తెలిఁగెడుమాయనే, విద్య, అవిద్యయనియును, ప్రకృతి పురుషద్వయమనియును జెప్పంబడుచున్నది. ఆచార్య స్వాములవారుచేసిన సిద్ధాంతమందును గుణులెఱుఁగునదే, ప్రకృతిద్వయమనిసాధించిరి. వారివాగ్దాంతమేసిద్ధాంతము. ఉన్నయచలపరిపూర్ణము ప్రకృతిద్వయమునెఱుఁగదు. కాఁబ

ట్టిప్రకృతిద్వయమే లేదు. ప్రకృతిద్వయమునకే బంధమోక్షములు. అచలపరిపూర్ణమునకంతరములేదు, బాహ్యము లేదు, ప్రకృతిద్వయములేదు గనుక క్షేత్రక్షేత్రజ్ఞలక్షణమైన ప్రకృతిద్వయమే యుపాధిద్వయము. ఉపాధిద్వయదోషమేదోషము. ఇది లేకుండిన సన్నిఁటియందును లోపటబైటనున్నయచలమునకు నంతరము లేదు, బాహ్యము లేదు, మొదలు లేదుకొనలేదు. ఎప్పటికినొక్కతీఱుగా నేయున్నది. ప్రకృతిద్వయమే లేదు.

“సమక్షేత్రమిూవంధ్యాపుత్రవత్” అని యున్నది గనుక క్షేత్రము మూడుగుణములువలననైనది. సత్వగుణమువలన నేనునేననెడు తెలివిపుట్టినది. ఆ తెలివికిఁగారణము క్షేత్రము. గాఢనిద్రలోఁగారణమున్నదో లేదో. క్షేత్రజ్ఞుఁడు లేకఁబోయెను. క్షేత్రము లేనియెడల క్షేత్రజ్ఞుఁడుండఁడు, మాయావిద్యాస్వరూపము గనుక క్షేత్రము మొదలయిన విషయములను గుఱుతెఱిఁగెడు పరాఖ్యచైతన్యస్వరూపిణియనెడు పేరుగలవిషయమే యధిష్ఠానము. అదే పరబ్రహ్మస్వరూపము. అదే సచ్చిదానందస్వరూపిణి. అదే జగత్కారణము. అదేయానందసమష్టి క్షేత్రము. అదే కార్యము. అట్టికారణమగు చైతన్యస్వరూపిణియనుపరాప్రకృతియే పెద్దయబద్ధము. సాక్షియైగుఱుతెఱిఁగెడు క్షేత్రజ్ఞుఁడైనపరాప్రకృతియే ప్రకృతిద్వయమని సిద్ధాంతము. ప్రకృతిద్వయమునకే భ్రాంతి, ప్రకృతిద్వయమునకే సంశయములు, ప్రకృతి

ద్వయమునకే యోగాభ్యాసములు, జ్ఞానమే ప్రకృతిపురుషులు, ప్రకృతిద్వయమే యవతారములు, క్షేత్ర క్షేత్రజ్ఞస్వరూపమైన ప్రకృతిద్వయమునకే బంధమోక్షములు. ప్రకృతిద్వయమువలననే వేదశాస్త్రాగమపురాణములు. ప్రకృతిద్వయమే కార్యకారణములు. చెప్పుట, వినుట, చూచుట, ఇవి మొదలుగాగలవియే ప్రకృతిద్వయము. ప్రకృతిద్వయమనఁగా మాయ. మాయయనఁగా నేమి లేదు. క్షేత్రమవిద్య, క్షేత్రజ్ఞస్వరూపమే మాయ; ఏది లేదో యదియే మాయావిద్య. మాయా లేదు, అవిద్య లేదు. ప్రకృతిద్వయమే మాయావిద్యాద్వయము. మాయయే యీశ్వరుఁడు. అవిద్యయే జీవుఁడు. మాయావిద్యారహితమే భ్రాంతిరహితము. క్షరోపాధి క్షేత్రము. అక్షరోపాధి క్షేత్రజ్ఞప్రకృతి. "క్షరాక్షరోపాధిద్వయరహితమేవ విచారస్య ఫలం" అను భగవద్వాక్యమునుబట్టి కల్పనరహితమైన పురుషుడే శుద్ధపురుషుఁడు. అట్టివాఁడు ప్రపంచమున్నదని యెఱుఁగడు, లేదని యెఱుఁగడు. ప్రకృతిద్వయదోషరహితుండును, జ్ఞానాజ్ఞానరహితుండును గనుక నతనికి యెఱుక మఱుపులు లేవు. ఐనను యెఱుక లేకపోవుటయును లేదు. ఉన్నదనునిర్ణయకర్త కాడు. తన్ను దానెఱుఁగడు. రెండవదాని నెఱుఁగడు. ప్రకృతి ద్వయమైన కారణవస్తువు ప్రకృతిద్వయము నెఱుఁగదు. ప్రకృతిద్వయమున్న కారణము నెఱుఁగదు. కాఁబట్టి ప్రకృతి

ద్వయదోష రహితమే విచారణఫలము. సాధ్యాసాధ్యపరామర్శరహితమే, ఐక్యము. అదే సుఖ దుఃఖ రహితము. అదియే యుత్పత్తిస్థితినాశ రహితము. అదేవృద్ధిక్షయరహితము. అదే క్షేత్రక్షేత్రజ్ఞలక్షణప్రకృతిద్వయరహితమైన కేవలాత్మ. సుషుప్తియందుఁ బ్రకృతిద్వయములేదు, కేవలాత్మయేయున్నది. మూర్ఛయందుఁబ్రకృతిద్వయములేదు, కేవలాత్మయేయున్నది. సమాధియందుఁబ్రకృతిద్వయములేదు, కేవలాత్మయేయున్నది. ఊరకున్నప్పుడు ప్రకృతిద్వయములేదు, కేవలాత్మయేయున్నది. మరణమందుఁబ్రకృతిద్వయములేదు. కేవలాత్మయేయున్నది. ఈయైదవస్థలయందు నేలాగునున్నదో, ఆలాఁగుననే గురూపదేశానంతరము ప్రకృతిద్వయములేక కేవలాత్మయేయున్నది. సాధనముచేత సాధ్యముకాదు. జ్ఞానముచేతనే తెలియఁబడును. జ్ఞానమనఁగాబప్పుబువ్వ. గుఱుతెఱుఁగునది జ్ఞానముకాదు వేఱేయున్నదందురు. ఆలాఁగు చెప్పుటసరి కాదు.ఎఱుకలేనిదిజ్ఞానముకాదు,అజ్ఞానము కాదు, జ్ఞాతకాదు, ద్రష్టకాదు. గనుకనేత్రిపుటిరహితము. "విజ్ఞానమయోత్పన్నం జ్ఞాతాజ్ఞానంమనోమయం । జ్ఞేయంబుద్ధ్యోదయమేవ ఇతిత్రయోత్పత్తిఃపురఃజీవః । ప్రకృతిః జీవోపాధిః" ప్రకృతిద్వయమేయుపాధిద్వయము. దేహములేనేలేదు. దేహముతోడన

న్నియునుబోయెను. "శరీరత్రయాఖ్యః పరాప్రకృతి నామసిద్ధిరహితాయనమః. సత్యాఖ్యబ్రహ్మరహితః, చిద్రూపరహితః, నిర్గుణరహితః, బంధమోక్షరహితః, అద్వైతరహితః, విద్యావిద్యారహితః, అహంపదచైతన్యరహితః, త్వంపదచైతన్యరహితః, శబ్దరహితః, పురుషరహితః, గురుశిష్యరహితః, లక్ష్యార్థరహితః, వాక్యార్థరహితః" అనియున్నదిగనుక తత్వరహితమైన నీవునేనులేనిదే నిజస్వరూపము. అదియుత్పత్తిస్థితిలయములనెఱుఁగదు. ఏమిపుట్టుచున్నదో. ఏమిలయించుచున్నదో. ఏమియున్నదో. ఎవరెఱుఁగుదురో. ఇది యున్నదని చిత్తుకు నెఱుఁక. చిత్తు మాయావిద్యయైయున్నది గనుక నెవరును గానరు. అట్టిది చెప్పెడువారే గురువులు. వినెడువారే శిష్యులు. ఇంతకంటెమాయలేదు. ఏమివ్రాయుదును. సర్వంమాచరణములకు జువ్వెనూరుజాబులు. సచ్చిదానందరహితాయనమః॥ శ్రీమద్వ్యజనాధ్యయనధ్యానత్రిణీకర్మనిరతులైన. వేదసారస్వరూపమైన. చైతన్యస్వరూపమైన అనిజాబులువ్రాయుచున్నారు. మహాకారణదేహరహితమైన వేదసారాతీతమేమివచ్చుచున్నదో, అదియే నిజము. మాయావిద్యయనెడు చైతన్యమునుగూర్చి, గుఱుతెఱిఁగెడుచైతన్యమునకు నేలాగు సమాధానమై

ననాలాఁగు నాశీర్వచనములు. నమస్కారములు. దండములు. అనిమాయయే సమస్తభాషారూపిణియైయున్నట్టున్నది. విచారించినవారికిలేదు. ఇదిసిద్ధము. విచారించెడు మహాకారణదేహమనుపేరుగల చైతన్యరహితులుగనుకనున్నదనియెఱుఁగరు. వారికిగుఱుతెలుఁగుటేదోషము. అట్టిదోషరహితులే సిద్ధులు. జ్ఞానులేయజ్ఞానులు. నేనెఱుఁగుదును, నేనెఱుఁగుదునని చైతన్యమేయనుమన్నదిగనుకమాయావిద్యయేలేదులేదు.ఇదియత్యంతరహస్యము. శాస్త్రములు మాయావిద్య. చైతన్యమునకంటెనేమిలేదని వేదములుచెప్పినవి. వేదములనఁగా గ్రంధములు. ఉన్నజడమును మాయావిద్యయనివ్రాసినారు. ఆశాస్త్రములలోనే ప్రకృతులు రెండైనవి. చైతన్యము పరాప్రకృతి. జడమపరాప్రకృతియనియున్నదిగనుక నిదిచిత్తుకాదు. జ్ఞానముమహాకారణదేహము. శరీరత్రయమజ్ఞానమని మర్యాద. సర్వమును గుఱుతెలిఁగెడు చైతన్యమని వేదశాస్త్రములకు నభిమానము. మనుష్యులకునాలాఁగే, జ్ఞానస్వరూపులుగనుక నొక్కటేకల్పనకుమూలము. జ్ఞానమునకంటె కర్మము వేఱులేదు. గుఱుతెలిఁగినదేచేయుచున్నదిగనుక, వేదశాస్త్రములనుజూచి వెఱువవద్దు. గుఱుతెలుఁగునదే దానిప్రభావము. గుఱుతెలుఁ

గుచే గురుద్రోహము, సర్వార్థమూలముగనుక నిర్గుణముగన్నుక, అద్వైతముగనుక హేతువులేదు. హేతువులే నిజము. మీకుపరమాద్వైతప్రసన్నమై మీకుఁదెలిసినదిగనుక, తెలివివలెనున్నది. ఎఱుకనుగెలుచుట కఠినము. విద్యకంటెనవిద్యలేదు. చూచెదమని నయుత్పత్తిస్థితిలయములుగలుగును. ఎందువల్లగలుగుననఁగా, చైతన్యముచేతనేయని గ్రంథములలోవ్రాసియున్నది. చైతన్యమనునదియట్టిదే. అదిలేకుండిన సత్తేమియునులేదు.ఏమిపుట్టుచున్నది,ఈమిథ్యయెవరికిన్నిదెలియదు, భగవానులకుందెలుసుననిభ్రమ. భగవానులును చిత్తాఖండమూర్తియే, కాకుండిన భగవానులెక్కడమనమెక్కడ. మాయకంటెవేఱులేదు. ఇదివిచారించినమీకుచాలును. మఱలమఱలఁ జూడుడు. అమ్మగారికినయ్యగారికివినుపించి, ఎఱుకేమిలేదని జాగ్రతగానుండవలయును.

ఇతిగద్యా॥ శ్రీమద్గురుశివరామదీక్షితప్రభావే. వేదాంతవిచారణే,పూర్వభాగే. క్షేత్రక్షేత్రజ్ఞ ప్రకృతిద్వయ నిరసన ప్రకరణం చతుర్థోధ్యాయః సంపూర్ణం.

---



శ్రీసద్గురవేనమః.

### పూ ర్వ భా గ ము.

## ధర్మాధర్మనిరసనప్రకరణము.

శ్లో॥ చిదేవదేవఃచిదేవలోకాః । చిదేవభూతానిచిదింద్రియాని । కర్తాచిదంతఃకరణంచిదేవ । చిదేవసర్వంపరమాత్మరూపం॥

శ్లో॥ చిదేవాస్త్రీచిన్మాత్రం । ఇదంచిన్మయమేవచ ।
చిత్త్వంచిదహమేతేచ । లోకాశ్చిదితిసంగ్రహం ॥

శ్లో॥ చిదేవపంచభూతాని । చిదేవభువనత్రయం ।
విజ్ఞానమేవమధురం । రమ్యంగ్రాహ్యంచిదేవహి ॥

తస్మై చైతన్యస్వరూపాయనమోనమః, సిద్ధోహం, బుద్ధోహం, హంసోహం, అహంబ్రహ్మాస్మి, అనిజీవేశ్వరైక్యజ్ఞానం, అనియున్నదిగనుక, జ్ఞానమే బ్రహ్మస్వరూపము, జ్ఞానమేపరమాత్మ, గుఱుతెఱుఁగువాఁడనేనేను. నేనుగుఱుతెఱుఁగునది యెక్కడనున్నదోయనిన, నదిపరోక్షజ్ఞానము, నేనుగుఱుతెఱిఁగెడు ప్రకృతిననిన, యదేసాక్షాత్కారము. జ్ఞానమునకంటెను ధ్యాడ్డదిలేదు, గుఱుతెఱుఁగునదే జ్ఞానమనిచెప్పుటనః. ఉపనిషత్తులయందునాలాఁగే చెప్పఁబడుచున్నది. సాక్షియనిన గుఱుతెఱిఁగెడువాఁడు, సాక్షియనిన, గుఱుతెఱిఁగెడు చైతన్యస్వరూపిణి. సాక్షివర్జితమనిన, మాయారహితము, అవిద్యారహితము, ప్రకృతిద్వయం

హితము, తురాతురోపాధిద్వంద్వదోషరహితము. ప్రకృతిద్వయమునకే జగత్తుతోఁచుచున్నది. ప్రకృతిద్వయరహితునకేలఁదోఁచును. ఉన్నవానికున్నదేతోఁచును. లేనివానికి లేనిదే లేదు. పుట్టనిచావనిది కేవలాత్మ, పుట్టునదిజచ్చునది ప్రకృతిద్వయము. ప్రకృతిద్వయములేకుండిన, చావుపుట్టుకలులేనిదేయున్నది. రెండున్నవనిచెప్పిన, సత్యద్వయముగాఁబట్టి, రెండున్నవనిచెప్పరాదు, లేనిదెప్పుడునులేదు, ఉన్నదెప్పటికినిలేకపోదు. ఇదేవిచారణకుఫలము, ప్రకృతిద్వయదోషరహితమేయనుభవము. అనుష్ఠానములేదు, విచారణయేకారణము, ప్రకృతిద్వయమేయనుష్ఠానముచేయునది, ప్రకృతిద్వయమేవిచారించునది, ప్రకృతిద్వయములేదని నిశ్చయమయ్యేపర్యంతము విచారించవలయును. సర్వకాలము ప్రకృతిద్వయరహితమేమౌనము. ఉపాధిద్వయదోషరహితమేమడి. ఉపాధిద్వయదోషసహితమేమైలు. ఉపాధిద్వయదోషరహితమే సుజ్ఞానము, ఉపాధిద్వయదోషరహితమే మహాపూజ, ఉపాధిద్వయదోషరహితమేతీర్థము, ఉపాధిద్వయదోషరహితమేజన్మరాహిత్యము. ఉపాధిద్వయదోషరహితమేప్రసాదము. ఉపాధిద్వయదోషరహితమేగురుపూజ. ఉపాధిద్వయదోషరహితమేసిద్ధి. ఉపాధిద్వయదోష ర

హితమేలోకాతీతము. ఉపాధిద్వయదోష రహితమే యింద్రియజయము. ఉపాధిద్వయదోషరహితమేనీమము. ఉపాధిద్వయదోషరహితమేస్త్రీవర్జితము. ఉపాధిద్వయదోషరహితమేపురుషవర్జితము. ఉపాధిద్వయదోషరహితమే యఖండైశ్వర్యము. ఉపాధిద్వయదోషరహితమేయకర్తృత్వము. ఉపాధిద్వయదోషరహితమేయభోక్తృత్వము. ఉపాధిద్వయదోషరహితమేశూన్యము. ఉపాధిద్వయదోషరహితమే నిర్గుణము. ఉపాధిద్వయదోషరహితమే గుణాతీతము. ఉపాధిద్వయదోషరహితమే యుత్తమము. ఉపాధిద్వయదోషరహితమే బీజరహితము.

ఇతిగద్యా॥ శ్రీమద్గురుశివరామదీక్షితప్రభావే,

వేదాంతవిచారణే, పూర్వభాగే,

ధర్మాధర్మనిరసనప్రకరణం,

పంచమోధ్యాయః

సంపూర్ణం

---



శ్రీసద్గురవేనమః.

## పూర్వభాగము.

## కారణతనునిరసనప్రకరణము.



గుఱుతెఱిఁగెడి యెఱుకేసచ్చిదానందము. అదికన్నులయందున్నది. చూచునది సచ్చిదానందముగనుకను, నేనెఱుఁగుదునని యనుభవమున్నదిగనుకను, నేనే సచ్చిదానందము. ఈసచ్చిదానందమే పరదేవతయనెడియమ్మవారు. సర్వమునుగుఱుతెఱిఁగెడి యమ్మవారే, సప్తకోటిమహామంత్రస్వరూపిణి, సార్ధగాయత్రి, సావిత్రి, సరస్వతీ. సచ్చిదానందస్వరూపిణి, అనియున్నదిగనుక, గుఱుతెఱిఁగెడుసచ్చిదానంద స్వరూపులేయందఱును. ఈయెఱుకకే యన్నికులములు. అదెట్లనిన, ఎఱుకతోడనేయందఱును, నేనుపలానివాఁడను, నేనుపలానివాఁడనని చెప్పుదురు, గనుకనందఱు నెఱుకస్వరూపులే. ఈగుఱుతెఱిఁగెడు సచ్చిదానంద ముండెనేని యందఱునిజమే. ఈగుఱుతెఱిఁగెడు సచ్చిదానందము లేకఁబోయెనేని యందఱబద్ధమే. అచలపరిపూర్ణము, తనకుఁదానేస్వతస్సిద్ధమైయున్నదిగనుక, దానికియెఱుకలేదు, మఱపులేదు. పరిపూర్ణము దేహాకారముగాకయున్నదిగనుక, దానికివికారములేదు, గుణములేదు

పరిపూర్ణమునకంటె నెక్కువలేదు. ఈశరీరముపుట్టక మునుపే, యచలముతనకుఁదానే స్వతస్సిద్ధమైయున్నది గనుక నదియెన్నటికిఁజలించదు. దేహాకారముగాక యున్నది గనుక నెట్టికమఱుపులు లేవు. ఉన్నదున్నట్లె యున్నది. సర్వకాలంబొకటిఁగానేయున్నది. ఉన్నదున్నట్టుతెలిపెడు కలఁతలేని, నిజగురుఁడుగావలయును. గురుఁడెట్టిక స్వరూపమైయుండిన, నందఱుతల్లిసాంప్రదాయమువారే. వశిష్ఠులవంటిఋషులు కొందఱుక ర్మయోగులు. శుకులవంటివిరక్తులుకొందఱుజ్ఞానులు. ఈరెండుతెగల వారునుమునీశ్వరులే. జ్ఞానులుకర్మరహితమైనశుద్ధ మార్గమువారుకారు. వశిష్ఠాదులేబ్రాహ్మణులకుమూలము. వారిసాంప్రదాయమువారికేతెలునును, వారికేయెట్టిక శాస్త్రములేకనడిచేవారేబాధ్యులు. నులకచెన్నయ్య, చందయ్య గారెశైవ్రులు. అప్పయ్యదీక్షితులు,వారికిభక్తుడట వారిదిన్ని బసవన్నగారికులమే గనుక, రామానుజాచార్యుల వారిదిన్ని బసవన్నగారికులమె. రామానుజాచార్యులవారు, మారునూరి నంబిగారికిశిష్యుఁడఁట. తిరుప్పాణియాళ్వారుల వారికిభక్తుఁడఁట, మాలవారైననుమహాపెద్దలఁట, వశిష్ఠాదులతోసమానముశ్యామలాశక్తితంత్రిమతంగమహాఋషిగనుక,కొందఱుఋషులాసాంప్రదాయమువా

రే, వారేశాక్తేయమతమువారు.శక్తియున్నదనియను కొనువారుకొందఱు,చార్వాకులుకొందఱు, సూర్యుఁడే దేవుఁడనినమ్మియుండువారు. ఈషణ్మతములవారు కులముచెడినపతితులే. ఈషణ్మతములవారే సర్వసమాచములు.బ్రాహ్మణుఁడు సత్యమైనయెడల క్షత్రియుని యన్నమేలాగుతినెను.

ఆర్యాధిష్ఠితాః సతచ్ఛూద్రా। ఆర్యాః పూతాః ।
వైశ్వదేవాః స్సంస్కార్యాస్యు।ఆర్యాస్త్రైవర్ణికాః ॥

అనియున్నదిగనుక, శాస్త్రముచేతనే కులముచెప్పుట. శాస్త్రముచేతనే గుణతెలిసెడుజ్ఞానము. సర్వమునుగుణతెలిసెడు జ్ఞానమే చైతన్యము. చైతన్యమేక్షేత్రజ్ఞుఁడు. వాఁడేసచ్చిదానందస్వరూపమైన యాత్మ, వాఁడేపురుషుఁడు, వాఁడే ఈశ్వరుఁడు, వాఁడేసర్వమునుగుణతెలిసెడువాఁడు, గనుకనే సర్వజ్ఞుఁడనిపేరు. ఒకదేహములో జ్ఞానముకించిత్తుగనుకనే, వాఁడుకించజ్ఞుఁడనఁబడును. కర్మప్రతిపాదకశాస్త్రమునకుబదులు జ్ఞానప్రతిపాదకశాస్త్రము. దీనివలననే కర్మముపుట్టుచున్నది. కర్మముద్వారా జ్ఞానోదయమనువారి నేమనిచెప్పవచ్చును. జ్ఞానమే కర్మమును జేయుచునుచున్నది. వేదశాస్త్రములనుశోధించెడుగురువులు వెఱ్ఱివారే. గుణతెలుఁగుటచేత కర్మముపుట్టుచున్నది. గుణతె

తెలిఁగెడుజ్ఞానమే సర్వార్థములు. నేనునేననిప్రవర్తించు నదియే స్వతస్సిద్ధమైనజ్ఞప్తి. బ్రహ్మస్వరూపమునకే యాత్మయనిపేరు. అదేజీవుఁడు, గుఱుతెలిఁగెడు జ్ఞానమునకేసకలయుపదేశములు. చెప్పుటజ్ఞానము, చేయుటజ్ఞానము, వినుటజ్ఞానము, వినుపించుటజ్ఞానము, ఇవియన్నియునుజ్ఞానమనియెవరెఱుఁగుదురో, వారేమిచేయుచున్నారు, ఏమివిడుచుచున్నారు. జ్ఞానమేలోపట బైటనున్నదని చెప్పడము. అట్టిజ్ఞానమే మిధ్యయని తెలిసిన, దేనికిబైట, దేనికిలోపల. అంతర్బాహ్యములుకల్పితములు. బట్టబయలుదేహములోఁజొచ్చినదా. వెళ్లిపోవుచున్నదా, అన్నితిప్పలు, గుఱుతెఱుఁగునట్టి మాయకే,దానిమహిమనేమనిచెప్పవచ్చును.ఉన్నదనఁగానున్నది, చూచుచుండఁగా లేనేలేదు. గురూపదే శానంతరములేదు. మహావాక్యముల నెవరికినుపదేశింతును. అవి జ్ఞానప్రతిపాదకమే, జీవేశ్వరప్రతిపాదకమే "తవాతీతంనిజం" అనుపేరులేనిఘుట్టియెవరికిఁగలదో. వారేశుద్ధపురుషులు.వారుజ్ఞానులుగారు, అజ్ఞానులుగారు. ఇదేయుపదేశము, అద్వైతముమిధ్య, అదిజ్ఞానస్వరూపముగనుక నదియే యమృతవాక్యము. అదిన మ్మినవారికిఁగష్టము,సంశయములేదు. కన్నులయందున్న దియెఱుక. అది మాయరూపముగవ్యాపించి, శాస్త్ర

నిర్ణయములతోఁ జెప్పఁబడినది. దానికే జ్ఞానమనియును చైతన్యమనియును, జ్ఞప్తియనియును, క్షేత్రజ్ఞుఁడనియును, అవిద్యయనియును, ఈశ్వరుఁడనియును, మాయయనియును, జీవుఁడనియును, ప్రకృతియనియును, పరబ్రహ్మమనియును, సచ్చిదానందమనియును, స్వరూపమనియును, పరమాత్మయనియును, మహాలింగమనియును, ఆదినారాయణుండనియును, మహాదహంకారమనియును, పురుషుఁడనియును, మాయకే పరినామములు.

అట్టిమాయయందు, పెద్దలు, పిన్నలు, యోగులు, భోగులు, జ్ఞానులు, కర్మలు, మానులు, ఋషులు, దొరలు, దొంగలు, రాజులు, భృత్యులు, దిగంబరులు, సన్న్యాసులు, వ్యాసాదిమహామునులు, దశావతారములు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, ముప్పదిమూడుకోట్లదేవతలు, బ్రాహ్మణులు, చండాలురు, అష్టాదశవర్ణములు, సంధ్యావందనములు, నిత్యనైమిత్తికములు, కర్మములు, ప్రతిదివ్యాదికజడములు, కించిజ్జ్ఞత్వములు, సర్వజ్ఞత్వములు, జననమరణములు, సుఖదుఃఖములు, ద్వైతాద్వైతములు, కర్తాకర్తములు, జ్ఞానాజ్ఞానములు, నానామతములు, నానానిర్ణయములు భక్తమహేశ్వరులు, నిమిత్తమైనదాపత్వములు, గురువులు, శిష్యులు, మహాత్ములుసామాన్యులు, చిత్రవిచి

త్రములైనస్వరూపములు, పాపపుణ్యములు, బంధ మోక్షములు, సకలసంశయములు, సకల నిశ్చయము లు, గుఱుతెఱిఁగెడిజ్ఞానబీజమునందుఁజెప్పఁబడినవి. వీ టిలోనొకటియుండిన, మఱియొకటియుండదు. అనేక జన్మగురుభక్తినిష్ఠఫలప్రాప్తిచేతనీబీజమునునిరసనము చేయునట్టిసద్గురుని తావుకుంబోయిన, వారు, అన్నిటి కిమూలమైనదానిని లేకుండఁజేయుదురు, వెంటనే చంచలమనునది నాశనమై, ఎక్కడఁజూచిన యచల మైయుండును. ఇదేమనియడుగుదమనిన, యడుగుట కు తానులేఁడు, చెప్పుటకు గురుఁడులేఁడు, అచల మమాత్రమేయుండెను. దానికిరాకపోకలులేవు, మొ దలుతుదలులేవు, చావుపుట్టుకలులేవు,జ్ఞానకర్మములు లేవు, పుణ్యపాపములులేవు జననమరణములులేవు, సుఖదుఃఖములులేవు, బంధమోక్షములులేవు, కించ జ్ఞత్వ సర్వజ్ఞత్వములులేవు, నిశ్చయములేదు, జ్ఞా నములేదు గనుకనన్నిబంధములీగుఱుతెఱిఁగెడుదాని కేకలవు. సకలనిర్బంధములకు మూలమైనది యీగు ఱుతెఱిఁగెడుశరీరమే. శరీరరూపమైన చైతన్యమేమిలే కుండఁజూచిన, పుట్టనిచావనియచలము స్వతస్సిద్ధమై యున్నది. శ్రుతి॥ నజాయతే, నవిద్యతే॥ ఆకాథ్యా

యములు, మతాధ్యాయములు, నిజగురు కరుణాకటాక్షము సంపూర్ణమైనవారికి లేవు. సర్వకాలమేకకాల స్థితిగానుండును.

ఇతిగద్యా॥ శ్రీమద్గురు శివరామదీక్షితప్రభావే,

వేదాంతవిచారణే, పూర్వభాగే,

కారణతను నిరసనప్రకరణం

షష్ఠమాధ్యాయః

సంపూర్ణం





శ్రీసద్గురవేనమః.

## పూర్వభాగము.

## గీర్వాణభావార్థదీపికాప్రకరణము.



యద్యద్వదంతి= ఏదియేదిచెప్పుచున్నారో. తత్తత్సర్వంశూన్యం= అదియంతయునుశూన్యము. మనుష్యేషు=మనుష్యులయందు. యద్యత్పశ్యంతి=ఏదియేదిచూడఁబడుచున్నదో. తత్తన్నరశృంగవత్=అదియదినరులకుఁ గొమ్ములవలెనే. యద్యయత్కుర్వంతి=దేనిదేనినిఁజేయుచున్నారో. తత్తద్గోష్వేషువంధ్యాపుత్రవత్ = అదియదిగొడ్డుటావుదూడవలెనే .సర్వేషు=సమస్తమైనవారు. యద్యచ్ఛృణ్వంతి=దేనిదేనిని వినుచున్నారో. తత్తదభ్రపుష్పవత్ = అదియదియాకాశపుష్పమువలెనే. సర్వం = సమస్తమయినవారు. యద్యద్విజానంతి=దేనిదేనినిగుఱుతెఱుఁగుచున్నారో తత్తత్=అదియది.అనంతం=అపరిమితము. నవదతి=పలుకదు. నపశ్యతి=చూడఁదు.నశృణోతి=వినఁదు. నకరోతి=చేయదు· నవిజానాతి=గుఱుతెఱుఁగదు· నవర్ధతే=పెఱుగదు· నజాయతే=పుట్టదు· నమ్రియతే=చావదు. నపునర్జాయతే=మఱలపుట్టఁదు. నగచ్ఛ

తి=పోదు· నజ్ఞానం=జ్ఞానముకాదు. నజీవతి=జీవించునదిగాదు. నవిద్యా = విద్యకాదు. నేశ్వరః = ఈశ్వరుఁడుగాఁడు· నఐక్యం=ఐక్యముకాదు. నానుభవః =అనుభవముకాదు. నముక్తిః = ముక్తికాదు. నాధిష్ఠానం=ఉండుటకాదు. నబ్రహ్మా=బ్రహ్మముకాదు· నశ్రవణం=వినుటకాదు. నమననం=అభ్యాసముకాదు. నధ్యానం=ధ్యానముకాదు· నపుణ్యం=పుణ్యముకాదు. నపాపం=పాపముకాదు. నధర్మం=ధర్మముకాదు. నదేవః=దేవుఁడుకాదు. నవైరాగ్యం = వైరాగ్యముకాదు. నభక్తిః=భక్తికాదు. ననియమం=నియమముకాదు. నేచ్ఛావిహారః=ఇచ్ఛావిహారమునుగాదు. నదానం=దానముకాదు· నత్యాగం=త్యాగముకాదు. నగ్రహణం=పట్టుటకాదు. నజపం=జపముకాదు· నపారాయణం=పారాయణముకాదు. నపూజా=పూజకాదు. నహోమం=హోమముకాదు. నకాలః=కాలముకాదు· నయాత్రాణి = యాత్రలుకాదు. నలోకాః=లోకములుకాదు. నవిధిః=విధికాదు· ననిషేధం=నిషేధముకాదు· నాభిమానం=అభిమానముకాదు. నప్రపంచం = ప్రపంచముకాదు. నజగత్ = జగత్తుకాదు. నవిశ్వం=విశ్వముకాదు. నదృశ్యం = దృశ్యముకాదు. నక్షేత్రజ్ఞః=క్షేత్రజ్ఞుఁడుకాదు. నాత్మా =

ఆత్మ కాదు.నపురుషః = పురుషుఁడుగాఁడు. నస్థానం=స్థానముకాదు. నమానం=మానముకాదు. నజ్యోతిః=జ్యోతికాదు. నప్రకాశం=ప్రకాశముకాదు.నసత్ =సత్తుగాదు. నసాక్షీ=సాక్షిగాదు. నద్రష్టా=చూచువాఁడుకాదు.నలక్ష్యార్థం=లక్ష్యార్థముకాదు.నవిలక్షణం=విలక్షణముకాదు. నాతీతం=దాటుటకాదు. నమహాకారణం=మహాకారణముకాదు. నతుర్యావస్థా=తుర్యావస్థకాదు. నగురుః=గురుఁడుకాఁడు. నశిష్యః=శిష్యుఁడుకాఁడు.నవాచకః=వాచకముకాదు. నవాచ్యం=వచింపఁబడునదికాదు. నమహావాక్యాని=మహావాక్యములుకాదు. నోపదేశః=ఉపదేశముకాదు.నవేదాః=వేదములుఁగాదు. నశ్రుతిః=శ్రుతులుకాదు. నప్రమాణం=ప్రమాణముకాదు. నసూత్రాణి=సూత్రములుకాఁదు. నశాస్త్రాణి=శాస్త్రములుకాదు. నపవిత్రం=పవిత్రముకాదు. నోచ్ఛిష్టం = ఉచ్ఛిష్టముకాదు. నతీర్థం=తీర్థముకాదు. నప్రసాదం= ప్రసాదముకాదు. నవందనం=వందనముకాదు. నభాషా=భాషయునుగాదు. నముద్రా=ముద్రలుగావు. నరాజయోగః=రాజయోగముకాదు. నదేవకార్యం=దేవకార్యముకాదు. నపితృకార్యం= పితృకార్యముకాదు. నసంవత్సరం=సంవత్సరముకాదు. నమాసః=మాసముకాదు. నతి

థిః=తిథికాదు. నవారం=వారముకాదు. ననక్షత్రాణి=నక్షత్రములుకాదు. నసాధ్యం=సాధించుటకాదు. నసామరస్యం = సమరసముకాదు. నమధురం = తీపుకాదు. నమానం=మానముకాదు. నస్త్రీ=స్త్రీకాదు నపురుషః=పురుషుఁడుకాదు. నలజ్జా=లజ్జకాదు. నరతీ=రతికాదు. నబిందుః=బిందువుకాదు. నబీజం=బీజముకాదు. నరాగః=రాగముకాదు. నమత్సరం=మత్సరముకాదు. నభగవాన్=భగవానుఁడుగాఁడు. నఋషిః=ఋషికాఁడు. నమునిః=మునికాఁడు. నసిద్ధిః=సిద్ధికాదు. నాంతరం=లోపలకాదు. నబాహ్యం=వెలుపలకాదు. నసర్వం=సర్వమునుగాదు. నసర్వశూన్యం=సర్వశూన్యమునుగాదు. సర్వశూన్యేషు=సర్వశూన్యమునందు, కేన=ఎవనిఁగూర్చి, కోవదతి=ఎవఁడుపలికెను. కేనకింపశ్యతే=ఎవరిచేత దేనినిఁజూడఁబడినది. కఃశృణోతి = ఎవనింగూర్చివినుచున్నాఁడు. కేన=ఎవనిచేత, కిం=దేనిని, కరోతి=చేయుచున్నాఁడు. కేనకంవిజానాతి=ఎవనిచేత, దేనినితెలుఁగుచున్నాఁడు. తస్మాత్ =గనుక,సర్వే=సమస్తమైన,వృత్తయః=ప్రవృత్తినివృత్తులు, కేవలాత్మని=కేవలాత్మయందు, నదృశ్యతే=కనఁబడదు. ఇతి=ఈప్రకారము, శ్రీవాచ్య = శ్రీవాచ్యమను పేరుకలిగినటువంటి, భావార్థసూత్రాణి=

భావార్థసూత్రములు, సంపూర్ణం = సమాప్తమైనవి.

యదా=ఎప్పుడు, అహంవృత్తి=నేననే వ్యాపారము, జాయతే=పుట్టుచున్నదో, తదా=అప్పుడు, చండాలత్వం=చండాలము. అహం=నేను, చండాలఇతి=చండాలుఁడనను, అనుభవాత్=అనుభవమువల్లనుండి, తద్వత్=వారివలెనే, సర్వేషాం=సమస్తమున్ను నేననే టటువంటివారికిని, ఉచ్ఛనీచస్వభావౌ=ఉచ్ఛనీచస్వభావములుయేమనఁగా. ఈశ్వరోహం= నేనీశ్వరుఁడను, కూటస్థోహం=నేనుకూటస్థుఁడను,బ్రహ్మాహం=నేను బ్రహ్మము, శివోహం=నేనుశివుఁడను, హంసోహం=నేనుహంసను, బుద్ధోహం=నేనుబుద్ధిగలవాఁడను,రామోహం=నేనురాముఁడను, ఏతాని=ఇవి, ఉచ్ఛస్వభావాని=ఉచ్ఛస్వభావములు. జీవోహం=నేనుజీవుఁడను, భక్తోహం=నేనుభక్తుఁడను, అహంజ్ఞానీ=నేనుజ్ఞానిని, విరక్తోహం=నేనువిరక్తుఁడను, అహంశ్రోత్రియః= నేను శ్రోత్రియుఁడను, అహంమత్తః= నేనుమత్తుఁడను, అహంధ్యాతా = నేనుధ్యానముచేయువాఁడను, అహంయోగీ=నేనుయోగిని, అహంభోగీ=నేనుభోగిని, అహంభోగ్యః=నేనుభోగించువాఁడను, అహంరోగీ=నేను రోగిని,ఏతాని=ఇవి,నీచస్వభావాని=నీచస్వభావములు. సర్వేజనాః=సమస్తమయినజనులు, అహంవృత్తేః=నే

ననెడువృత్తికి, స్వభావాః=స్వభావముగలవారు. సర్వదా=సంతతమును, అహంవృత్తిః=నేననేవ్యాపారము, జ్ఞానమేవా=జ్ఞానమని, కేచద్వదంతి=కొందఱుచెప్పుచున్నారు. తదసత్=అదిమంచిదికాదు. అహంవృత్తివ్యాపారాణాం=నేననేవృత్తివ్యాపారులకు, నాంతః = అంతములేదు. ఇతి=ఇట్లు. భగవద్వచనాత్=భగవంతునివచనమువల్లను, తస్మాత్=ఆకారణమునుబట్టి, అహంవృత్తేః=నేననేవ్యాపారమునకు, ననియమం= నియమములేదు. చిత్రవిచిత్రసామర్థ్యత్వాత్ = చిత్రవిచిత్రసామర్థ్యమువల్లనుండి, అస్మత్ ప్రత్యయం= నేననేటటువంటిప్రత్యయము, నిర్వికారఇతి = వికారరహితమని, కేచద్వదంతి=కొందఱుచెప్పుచున్నారు. తదసత్= అదిమంచిదికాదు. అహంనజానామి=నేనెఱుఁగకపోవుచున్నాను, అహంకరిష్యే = నేనుచేయుచున్నాను, వయంరాజానః=మేము రాజులము, అహందాసః=నేనుదాసుఁడను, అహంపుణ్యాత్మా=నేనుపుణ్యాత్ముఁడను, అహంవృత్తేస్సర్వావతారాని=నేననేవృత్తియేసర్వావతారములు, అహంకర్తా=నేనుకర్తనని, అహంభోక్తా=నేనుభోక్తనని, ప్రత్యక్షానుభవః = ప్రత్యక్షమైనయనుభవము. అహంసాక్షీ=నేనుసాక్షిని, తస్మాత్=ఆకారణమువల్ల, సాక్షినా=సాక్షిచేతను,సర్వంక్రియతే=

సమస్తమును జేయుచున్నదని, జ్ఞాత్వా=తెలిసి, అనంతరమేవా=తరువాతను, వృత్తిః=వ్యాపారము దర్శనాత్ =దర్శనమగుటచేత, అహంవృత్తేఃఅనంతనామాని =నేనునేవృత్తికేయపరిమితనామములు. అహం=నేను, కదాచిత్ =ఒకానొకప్పుడును, నజాయతే=పుట్టినవాడనుగాను. తస్య=అట్టియచల స్వరూపునకు, జననమరణభ్రాంతిరహితం = జననమరణభ్రాంతులు లేవు. నతత్పరం=దానికిఅన్యమేమియునులేదు. లోకే=లోకమునందు, ప్రతిబింబముఖే=ప్రతిఫలించిన ముఖమునందు, ప్రతిచ్ఛాయాముఖే=ప్రతిఫలించి నసీడయనెడు ముఖమునందు, యథా=ఎటుల, నజాయతే=ముఖము పుట్టినదికాదో, తథా=ఆప్రకారము, ముఖం=మొగము, నజాయతే=పుట్టినదికాదు. ఘటజలస్థచంద్రవత్ = నీటికుండలోనిచంద్రునివలెను, శశివిషాణవత్ = కుందేటికొమ్ములవలెను, వంధ్యాపుత్రవత్ =గొడ్రాలిబిడ్డవలెను, నప్రపంచం=ప్రపంచములేదు, గగనారవిందవత్ =ఆకాశ పుష్పమువలె, నవిశ్వం=విశ్వము లేదు. దర్పణాభావే=అద్దములేనిసమయము నందును, జలాభావే = ఉదకములేనిసమయమునందును, పురుషాభావే= పురుషుడులేని సమయమందును, ప్రయత్నః = ప్రయత్నము, నిష్ఫలం=ప్రయోజనములేదు.

అతః = ఆకారణమునుబట్టి, వికారరహితం= వికారము లేదు.

అహంవృత్తి రహితత్వాత్ =నేననేవ్యాపారము లేనందు చేత, శశివిషాణవత్ =కుందేటికికొమ్ములవలెను, గగనారవిందవత్ = ఆకాశపుష్పమువలెను, అసత్ నివృత్తిమాత్రేణ=అసత్తు నివర్తించినవెంటనే, సత్ నివృత్తిః= సత్తును నివర్తియగుచున్నది. యథా=ఎప్పుడు, దర్పణాభావే= అద్దములేకపోవుచున్నదో, తథా =అప్పుడు, ప్రతిబింబముఖాభావవత్ =ప్రతిఫలించిన ముఖములేనట్లువలెను, ఘటజలాభావమాత్రేణ= ఘటమందున్న యుదకములేకపోవుటచేత, చంద్రాభావవత్ =చంద్రుడును లేనటువలెను, దుఃఖాభావమాత్రేణ = దుఃఖములేనందుచేత, సుఖాభావః=సుఖమును లేదు. ఛాయాపురుషాభావవత్ = ఛాయాపురుషుడు లేనట్లువలెనే, తస్మాత్ =ఆకారణమును బట్టి, అహంవృత్తిరహితేన = నేననేవ్యాపారము లేనందుచేతను, ప్రయత్నం=ప్రయత్నము,ఆయాసరహితః=ఆయాసములేనందుచేతను, సుఖాభావవత్ = సుఖములేనందుచేతను, కుతః=భ్రాంతియెట్లు. గురువాక్యేన=ఆచార్యునివాక్యముచేతను, దృఢాభ్యాసేన = దృఢమైన యభ్యాసముచేతను, అతిసులభం = మిక్కిలి సులభ

ము. సుసుఖకర్తుమవ్యయం = సుసుఖం=మంచి సుఖమును, కర్తుం=చేయుటకొఱకు, అవ్యయం=నాశరహితమని, భగవద్వచనాత్ = భగవంతుని వచనముచేత. తస్మాత్=ఆకారణము వల్లనుండి, అహం=నేననే, వృత్తి=వ్యాపారము, నజాయతే=పుట్టదు. యథా నజాయతే = ఏప్రకారముపుట్టదో, తథా=ఆప్రకారముగానే, సర్వదాభ్యాసేన=సంతతము నభ్యాసముచేత, అహం=నేను, ఉత్పత్తిస్థితిలయరహితః=ఉత్పత్తిస్థితిలయములు లేనివాఁడను. సర్వదా=సంతతమును, అహంవృత్తిరహితత్వాత్ = నేననేవ్యాపారము లేనందుచేత, అత్యంతగురుసాంప్రదాయహితానాం=అత్యంతగురుసాంప్రదాయపరులకు, అహంవృత్తిః=నేననే వ్యాపారము, అభ్యాసదారుఢ్యత్వాత్=అభ్యాసదృఢత్వముచేతను, కదాచిత్= ఒకప్పుడును, నజాయతే=పుట్టదు. అభ్యాసంకుతః=అభ్యాసమెట్లు. గురువాక్యంయథాతథా=గురువాక్యమేలాగోనాలాగే. గురువాక్యంకిం=గురువాక్యమేమి. స్వప్రకాశత్వం=తననిజస్వరూపమగుటకు. అస్తత్ప్రయత్నత్వేన=నేనుప్రయత్నము చేయుటచేత, నిరంతరాపరోక్షవత్=సంతతమునపరోక్షజ్ఞానుడను. నదేహేంద్రియాణి= దేహేంద్రియములు లేనివాఁడను.

తత్ =ఆయచలము, నవిలక్షణజ్ఞానవత్ = విలక్షణమైన జ్ఞానమువంటిదికాదు. నపంచకోశాతీతవత్ = పంచకోశములను దాటినవంటిదికాదు. నావస్థాత్రయ సాక్షివత్ =అవస్థాత్రయసాక్షివంటిదికాదు. నాద్వైతం=అద్వైతముకాదు. నయోగవత్ =యోగమువంటిదికాదు. నాధిష్ఠానవత్ =అధిష్ఠానమువంటిదికాదు. "ఏవంధార్య తేజగదతీతం" ఈప్రకారము జగత్తునకతీతమైనదేదియో,అదియచలము.ఇతి=ఇట్లు, భగవద్వచనాత్ =భగవంతునివాక్యమునుబట్టి. ఏవం=ఈరీతి, ధార్యతే=దీనినిధరియింపఁబడినది. అధిష్ఠానంకిం=అధిష్ఠానమననగానేమి. తన్మాయా = అదియేమాయయనునది. జీవపంచీకృతత్వాత్ =జీవపంచీకృతమగుటవల్ల, నావిద్య=అవిద్యకాదు. నతత్వవత్ =తత్వమువంటిదికాదు. మోక్షసాధనేన నబోధవ్యం = మోక్షసాధనమువంటి తెలివికాదు. ననిత్యానందానుభవత్ =నిత్యానందానుభవమువంటిదికాదు. నభిన్నవత్ =భిన్నమువంటిది కాదు. నక్షేత్రవత్ =క్షేత్రమువంటిదికాదు. నజ్ఞప్తి వత్ = తెలివివంటిదికాదు. నజీవవత్ =జీవమువంటిది కాదు. నేశ్వరవత్ = ఈశ్వరునివంటిదికాదు. న కూటస్థవత్ =కూటస్థునివంటిదికాదు. నబ్రహ్మవత్ = బ్రహ్మమువంటిదికాదు. నప్రత్యక్చైతన్యవత్ = ప్ర

త్యక్షమైనదన్యమువంటిదికాదు. నతత్పదలక్ష్యార్థవత్ = తత్పద లక్ష్యార్థమువంటిదికాదు. నభగవత్స్వరూపవత్ =భగవత్స్వరూపమువంటిదికాదు. అస్తిన=ఉన్నది కాదు. నాత్మప్రత్యయవత్ =నేననేప్రత్యయమువంటిది కాదు. వేదశాస్త్రేణినవేద=వేదశాస్త్రములకుందెలి యదు. నాహంవృత్తిభావేన=నేననేవృత్తి లేకపోవుటచే త, నబోధాస్ఫురణభావేన=శ్రుతి తెలివిస్ఫురణ లేకపోవు టచేత, యనస్థితో=ఏదికాదో, తదేవ=అదేను. నప్ర త్యగ్బోధవత్ = ప్రత్యగ్బోధవంటిదికాదు. అహంవృ త్తేః=నేననేవృత్తికి, అన్యత్వాత్ = అన్యమగుటచేత, తస్మాత్ =ఆకారణమునుబట్టి, గురువాక్యానంతరం=గు రువాక్యమైనపిమ్మట, నశ్రవణాపేక్షా=వినుటలేదు. న మననాపేక్షా = అభ్యాసాపేక్షలేదు. నధ్యానాపేక్ష= ధ్యానాపేక్షలేదు. సదా = సంతతము, అహంరహిత త్వాత్ =నేననేదిలేకపోవుటచేతను, తత్ =అదేమనిన, అహంవృత్తిరహితత్వాత్ =నేననేవృత్తి లేకపోవుటచే త, అతిసులభం=మిగులసులభము. నిజగురువాక్యంవి నా=నిజగురుకటాక్షములేక, నసంభవతి=సంభవించ దు. దుస్తరత్వాత్ =దుస్తరమగుటచేత, అతిశయవా క్యత్వాత్ =అతిశయవాక్యమగుటచేత, వేదసారపరం జ్యోత్యతీతత్వాత్ =వేదసారమేయుత్కృష్టమైన తేజ

స్సునుదాటుటచేత, యద స్తిత దేవ = ఏదియున్నదో, అదేను. తద్వద=ఐతేదానినిచెప్పుమా. బద్ధముష్టివత్ అజ్ఞానం=ముయ్యబడిన పిడికిలివంటిదేయజ్ఞానము. ప్రకటితముష్టివత్ జ్ఞానం= తెలవబడిన పిడికిలివంటిదేజ్ఞానము. యధాబద్ధముష్టిః=మూయబడినపిడికిలియేప్రకారమో, తధాప్రకటితముష్టిః=ఆప్రకారమే తెలవబడిన పిడికిలిగనుక, ఆగంతుకత్వాత్ =నట్టనడుమవచ్చినదిగనుక, తద్వయోః భేదభావః=ఆరెంటికిభేదములేదు. సదా =సంతతము, ఉభయరహితమేవ=రెండునులేకపోవడమే, స్వభావః=నిజస్వభావము. అజ్ఞానాభావమాత్రేణ =అజ్ఞానములేకపోవుటచేత, జ్ఞానాభావః=జ్ఞానమున్నులేదు. సదసదితి=మంచిది, మంచిదికాదనేది, సమ్యగ్దర్శనాత్ =లెస్సగాదర్శనమగుటవలన, అత్యంతపరమితి = మిక్కిలి యుత్కృష్టమ నితెలుసుకొనుట. సిద్ధం = నిశ్చయము.

బృహదారణ్యభాష్యే=బృహదారణ్యభాష్యమునందు, దక్షిణాక్షిణచైతన్యే =కుడికంటియందుండెడుచైతన్యమునకును, వామాక్షిణచైతన్యే=ఎడమకంటియందుండెడుచైతన్యమునకును, వ్యత్యస్థమితి = భేదమని, ఉక్తం=చెప్పఁబడినది.తస్మాత్ =గనుక. శాస్త్రజ్ఞానంబహుక్లేశః=శాస్త్రజ్ఞానమురిగులదుఃఖకరము. బుద్ధేశ్చలనకారణం=బుద్ధికిచలనముకలుగును. ఉపదేశత్వాత్ =ఉపదేశమువలన, విరమతే=విరమించవలసినది. సర్వ

కర్మసు=సమస్తకార్యములు, పదార్థగోచరజ్ఞానం=సర్వపదార్థములనెఱిఁగెడుజ్ఞానమే. సర్వకార్యత్వాత్ = సర్వకార్యములవల్ల, జ్ఞానం=జ్ఞానము, జాయతే=పుట్టుచున్నది, ఇతిశ్రుతేః=ఇట్లు వేదములుచెప్పుటచేత, జాగ్రతావస్థాయాం=జాగ్రతావస్థయందు, జ్ఞానాధిక్యాత్ =జ్ఞానమధికమగుటచేత, సత్త్వాజాగరణంవిద్యా = సత్వగుణమువలనజాగ్రతను దెలియగలది. రజసాస్వప్నమదిశేత్ =రజోగుణముచేతస్వప్నమును దెలియగలది. తమసాసుప్తిమాంయాంతి = తమోగుణముచేత నిద్రను దెలియగలది. సర్వత్ర=ఎక్కడను, తుర్యావస్థా=తుర్యావస్థయనునది,అవస్థాతీతత్వాత్ =అవస్థలనుదాటినది. తద్దృష్టా=అదిచూడఁబడ్డది. చైతన్యవీక్షితం=చైతన్యముచేతఁజూడఁబడినది.

ఇతిగద్యా॥ శ్రీమద్గురుశివరామదీక్షితప్రభావే, వేదాంతవిచారణే పూర్వభాగే, గీర్వాణభావార్థదీపికాప్రకరణం. సప్తమాధ్యాయః సంపూర్ణం.

—*(గీర్వాణభావార్థములకు తాత్పర్యము)*—

ఆకాశపుష్పమువలెను త్రాడు సర్పమువలెను దారుపురుషునివలెను గొడ్రాలిబిడ్డవలెను, ఎండమావులయందలి నీటివలెను, ఈప్రపంచము తోఁచుచున్నదేగాని నిజముగా ప్రపంచమున్నదికాదు. కనుక దబ్బరయగు ప్రపంచమునందుఁదోఁచెడు సమస్తమును, అబద్ధమే. శరీరయాత్మలును, లోకాలోకములును, అద్దమునందలి ప్రతిబింబములవలెను, ఘటజలమునందలి చంద్రునివలెను గనుపించి ఒకానొకప్పుడు కనఁబడక నేపోవుచున్నవిగాన. ప్రపంచమును ప్రపంచమునందలిసమస్తవస్తువులును ఒకప్పుడుగనుపించి ఒకప్పుడు కనఁబడక నేపోవుచున్నవి. కాఁబట్టి

సర్వమును భ్రాంతివల్లనేదోఁచుట. భ్రాంతియే జగత్తునకు కారణము. భ్రాంతిలేనియెడల జగత్తుదోఁచదు. ఆచార్యస్వాముల వారి కరుణాకటాక్షము చేతనే భ్రాంతిరహితమై నిజస్వరూపము గావలయును. నిజస్వరూపమే యచలపరిపూర్ణము. ఈపరిపూర్ణముకంటె నన్యమేమియునులేదు. ఈపరిపూర్ణము సర్వకాలములయందును, సర్వదేశములయందును, సమస్తవస్తువులయందును, చలించక నిండి నిబిడీకృతమైయున్నది. పరిపూర్ణమునకు నంతర్బాహ్యములులేవు. మోక్షాదిపదవులులేవు. ఎఱుక మఱపులులేనియచలముగనుక సర్వకాలమొక్కటేవిధముగానున్నది.

సాధ్యాసాధ్యములుగాని పరతత్వముగనుక, ఆచార్యకటాక్షముతప్ప మఱి నేసాధనమువల్లను బొందనలవిగానిది. ఈపరిపూర్ణము ప్రత్యగాత్మ, పరమాత్మలకన్న నన్యమగు కేవలాత్మగావున దీనికి కించజ్ఞత్వ సర్వజ్ఞత్వములులేవు. వాచ్యార్థము, లక్ష్యార్థమునులేదు. ప్రపంచము. ఇరువదియైదుతత్వములోనిది, ప్రపంచమే ప్రత్యగాత్మ పరమాత్మ. కేవలాత్మ ప్రపంచాతీతమై, కనదు వినదు అనదుచలించదు, నిర్ఘోషమై శుద్ధనిర్గుణమైనది, సమస్తవృత్తులు నీజీవేశ్వరులకే. ఈజీవేశ్వరులే మాయావిద్యాస్వరూపములు. మాయారహితమేయచలము. ఇది యచలగురువుల వారికరుణాకటాక్షములేక నెంతటివారికిని పొందనలవిగానిది. అట్టియచలగురువునుజేరి నిజస్వరూపమునుగనుగొని భ్రాంతిలేనేలేదని సంతతముదృఢ నిశ్చయముగావలయును. ఇదియేజననమరణభ్రాంతిరహితము. కుడికంటియందుండు చైతన్యమునకును, ఎడమకంటియందుండు చైతన్యమునకును, బృహదారణ్యభాష్యమునందుభేదము చెప్పఁబడినదిగాన శాస్త్రజ్ఞానముబహుక్లేశము. ఎంతటివారికి సంశయమువిడువదు. ఆచార్యకటాక్షము చేత నిజస్వరూపమునుబొందుటే సత్యము.

ఇది శ్రీశివరామదీక్షితులవారి శిష్యపరంపరలోనొక్కరైన పోకల: శేషాచలాహ్వయుండగు, అచలభావజ్ఞునిచేరచియింపఁబడిన గీర్వాణభావార్థదీపికా తాత్పర్యసంక్షేపము. సంపూర్ణము.



శ్రీసద్గురవేనమః.

## పూర్వభాగము.

## ఉపదేశప్రకరణము.



చరమశ్లోకం॥ సర్వధర్మాన్ పరిత్యజ్య। మామేకంశరణంవ్రజ।
అహంత్వాంసర్వపాపేభ్యో। మోక్షయిష్యామిమాశుచ॥

హేశిష్యా=ఓ శిష్యుఁడా! సర్వధర్మాన్=సమస్తములైనధర్మాధర్మములుగల యెఱుకయనెడి యహంకారమును. పరిత్యజ్య=సమూలముగా నాచార్యునికటాక్షముచేతవిడిపించుము. మామేకం=అహంకారము లేని, ఒక్కఁడనైననన్ను,నాకంటెనన్యులులేరనినమ్మి, శరణంవ్రజ=శరణువేడుము. అహం=అహంకారములేనినేను, త్వాం=అహంకారుడవైననిన్ను, సర్వపాపేభ్యః=సర్వపాపములవలననుండి,మోక్షయిష్యామి=విడిపించఁగలను. మాశుచ=నీవులేకపోవుచున్నావనిదుఃఖపడకుమా.

ఎఱుకనాకేయెఱుక. నేనే యెఱుఁగుదుననియున్నదిగనుక, అహంకారమేజ్ఞానము. అహంకారమేయజ్ఞానము. అహంకారముతోడనన్నియునుబోయెను. కనుకనమస్కారముచేయువారేలేరు. నమస్కారమేలేదు. ఇదివైష్ణవసిద్ధాంతము. శైవసిద్ధాంత మిూలాఁగుననే. వైదీకమిూలాఁగుగాదు. చరమార్థముతోఁగూడ తిరు

మంత్రద్వయమువాడుక గనుక, అహంకారముతోనన్నియునుబోయెను. జ్ఞాన భక్తి వైరాగ్యములకుమూలము లేదు. చెప్పనిదేదియో, విననిదేదియో, ఎఱుక మఱపులులేనిదేదియో, దేహమున్నదో లేదోయని సంశయములేనిదేదియో, స్త్రీపురుషరూపములుగానిదేదియో, ప్రకృతిద్వయమనుశబ్దములేనిదేదియో, పుట్టుకచావులెఱుఁగనిదేదియో, వర్ణాశ్రమములులేని దేదియో, ధర్మాధర్మములులేనిదేదియో, పుణ్యపాపములులేనిదేదియో, జ్ఞానకర్మములుగానిదేదియో, సర్వకాలము జీవభావము జగద్భావముకానిదేదియో, వాసనలేనిదేదియో, సగుణనిర్గుణములుకానిదేదియో, శ్రవణ మనన నిధిధ్యాసములుగానిదేదియో, జాగ్రత్స్వప్నసుషుప్తితుర్యావస్థలనెఱుంగనిదేదియో, ఆఁకలిదప్పులులేనిదేదియో, కార్యకారణములనెఱుంగనిదేదియో, బంధమోక్షములులేనిదేదియో, నేనుగానిదేదియో, నేనునీవనుజ్ఞానరహితమైనదేదియో, ఆకాశాదిభూతములనెఱుఁగనిదేదియో, విషయావిషయములనెఱుఁగనిదేదియో, సాధనరహితమైనదేదియో, సర్వద్వంద్వరహితమైనదేదియో, జడాజడముల నెఱుఁగనిదేదియో, నేను నేననెడువృత్తిరహితమైనదేదియో, లోకాంతరభేదరహితమైనదేదియో, సదసత్తులుకానిదేదియో,

సుఖదుఃఖములు కానిదేదియో, భక్తి వైరాగ్య యోగ జ్ఞానములుగానిదేదియో, ఉన్నదిలేదని యెఱుఁగనిదేదియో, గురుశిష్యభావము రహితమైనదేదియో, తల్లిదండ్రులు, లోకములు, దేవతలు, వేదములు, శాస్త్రములు, పురాణములు సూత్రములు, భాష్యములు, దివసములు, దొరలు, దొంగలు, బ్రహ్మహత్యాది పాతకములు, బ్రాహ్మణులు, మాదిగలు, వ్యాసాదిమహాఋషులు, సంధ్యావందనాదినిత్యకర్మములు లేనిదేదియో, అదితాననెడియెఱుక లేనిదేదియో, అట్టియచలమును, భగవానులుమొదలైన వారెఱుఁగుదురు. అట్టివారుసర్వకాలమచలమయ్యేయున్నారు. ఇతరులెవ్వరునట్టి స్వరూపమెప్పటికినిగాలేరు. అశరీరులట్టిస్వరూపులయ్యే యున్నారు, కనుక, అచలముస్వతస్సిద్ధముగానేయున్నది. సర్వకాలముకల్పనారహితమైయున్న పరిపూర్ణమునందు కల్పనయున్నటుల లేనటుల యుండెను. మాయచేతంగల్పనకులోఁబడినటుల యగుచున్నది. నిజగురుసాంప్రదాయకుఁడుగాక, ఉన్నదియున్నట్టే తెలియక, శ్రవణాదులనెడు బొందలలో, వేద శాస్త్రములనెడు వాక్యములు ప్రవేశింపఁబడిన భ్రాంతివిస్తరించును. ఇదినేనుగాను, అదియేనేను, నేనే యది, అనెడి యహంకార మనెడి యెఱుకచేతనే, ఎఱుక యున్నంతసేఁపునీలాఁగున యనుకొనుచు

నదిపోయిన, దానితోడలయించుచుందురు. మఱలన దివచ్చిన దానితోడనేవచ్చిభ్రాంతినివిడువక దఱిదొ యుకక, కాలముగడపినయెడల, జననమరణప్రవాహ మువారిని విడువకుండును. సర్వకాల మొకరీతిగాను న్నవారికి భ్రాంతియుండునోయుండదోయని, సంశ యమునొందిన వారినింభ్రాంతివిడువదు, వారులోక ముతోటివారే, అహంకారముతదైక్యమైనటులయుం డునుగాని, అహంకారమునువిడిచినవారుకారు. ఇం దుకొఱకు శీఘ్రముగా, ఉన్నదియున్నట్టుతెలిపెడుని జగురుసాంప్రదాయకమునుగనిపట్టి, ఉన్నదియున్నట్టు తాత్పర్యమైనయెడల శత్రుతుయమై, సుఖదుఃఖరహిత మై, ఆదిమధ్యాంత శూన్యమైయుండెడవు, రాకపో కలులేవు. స్వరూపస్థితికంటె నధికముగా మఱియొకటి యున్నదనెడి యహంకారమున్నదోలేదో. అహంకా రమున్నదనియెఱిఁగినవాఁడేజ్ఞాని, లేదనియెఱిఁగినవాఁ డేయజ్ఞాని, ఉన్నదో లేదోయనిన సంశయము, ఏమి లేదనియున్నభోద్ధుఁడుగనుక, సర్వకాలము మూలము లేనిపరాప్రకృతి స్వరూపమే.

ఇతి, గద్యా, శ్రీమద్గురు, శివరామదీక్షితప్రభావే, వేదాంతవిచారణే, పూర్వభాగే, ఉపదేశప్రకరణం, అష్టమాధ్యాయః, సంపూర్ణం.



శ్రీసద్గురవేనమః.

# ఉ త్త ర భా గ ము.

## మూలప్రకృతినిరసన ప్రకరణము,



మూలములేని యీాగులు తెఱఁగెడు శరీరమేమిలేదు. ఇట్లుతనకుఁదానే తాత్పర్యమైనయెడల, మఱలఁ దోఁచుటకునేమియులేదు. శరీరమును గుఱుఁతెఱుఁగని బట్టబయలు తనకుఁదానేస్వతసిద్ధమై యెన్నటికిచలించకనున్న దేయున్నది. ఇదిశరీరములేని గురుసాంప్రదాయకము. ఇదేమహాద్వైతము. ఇదేద్వైతాద్వైతములకంటె పరతత్వము. అద్వైతమనిన విశిష్టాద్వైతమే. కేవలాద్వైతము కలలోనైనలేదు, ఉన్నకొంతసేఁపును, విశిష్టాద్వైతమే, ఐననుమూలములేనియీాగులు తెఱఁగెడు శరీరమేమిలేదు,కనుకవ్యవహారములేదు. శ్రీభాష్యకారులవారితాత్పర్యము అబద్ధమో నిజమో యనిసంశయము,నిజమేయని శ్రీశంకరాచార్యుల వారుసాధించినారు, ఐననునేనునుజదువుకొన్నానుగనుక అందుకునాకుందోఁచినంత యుత్తరముప్రాసినాను.శ్రీభాష్యకారులవారిసందియమేదో,అదియేవిశిష్టమైనది. ఆచార్య కటాక్షముచేత, మూలములేని యీాగులు తెఱఁగెడు శరీరమునుతెరనుదీసి, శుద్ధమార్గమును జూ

చినవారికి విశిష్టాద్వైతములేదు. ఈరెండునులేకుండి న,ద్వైతవార్తయునులేదు. సర్వకాలము, ఈశ్వరుఁడ నేవ్యాపకమున్నది. అదిగుణములేనిది. "వికారరహిత ఏవ ఈశ్వరః" అనియున్నదిగనుక వికారములేనివాఁ డేయీశ్వరుఁడు, కలలోఁదోఁచినరామకృష్ణులవలెకా దు, తెరకావల నీవలయున్న దేవుంతితముకానివైకుం ఠము.ఆచార్యస్వాములవారు,అఖిలాండకోటిబ్రహ్మాండ ములకునేనుదాసుఁడను, మూలములేనియీగుఱు తెలి ఁగెడు శరీరమేపరబ్రహ్మము, జ్ఞానమేనిర్గుణము, అనిసా ధించినారాలేదా? అదిసరికాదు. మూలములేనియీ గుఱుతెలిఁగెడు శరీరము పరబ్రహ్మమై, శరీరములే స్వ తంత్రులైయున్నయెడల, కొందఱు సేవకులై నీళ్లుమో యుటెట్లు, కొందఱువంటఁజేసి పెట్టుటెట్లు, మఱికొం దఱు, అగ్నిహోత్రాదులఁజేయుటెట్లు,మాదిగవాం డ్రవలెను, మాలవాండ్రవలెనుయుండక మేముబ్రా హ్మణులమని యభిమానముండుటెట్లు, ఆహా, అట్టిమా యావాదుల మార్గములను విచారించుడు. మూలము లేని యీగుఱుతెలిఁగెడు శరీరమను తెరనుందీసిన నేమియునులేదని మాసిద్ధాంతము, అంతయువైకుంఠ మే. అంతయునుగల్పనారహితమైనకైలాసమే.

శ్లో॥ తద్విష్ణోపరమంపదం సదాపశ్యంతిసూరయః ।
యద్గత్వానినివర్తంతే । తద్ధామపరమంమమ ॥

తతః॥శ్లో॥ తదంతర్పరిమార్గంత । త్వంయస్మిన్గతానినివ ।
ర్తంతేభూయఃఅంతరంప । డంతత్పరిమార్గతవ్యం ॥

అనియున్నది గనుకనందుకే, మూలములేనియీాగుఱు తెలిఁగెడు శరీరమను, తెరనుదీసి యందఱినిం జూచుటకొఱకు, "ఉత్తమపురుషస్తుఅన్యః" అనియున్నదిగనుకను, మూలములేనియీాగుఱు తెలిఁగెడుశరీరము లేకుండిన, ఉండునదంతయునచలమేయని తాత్పర్యము.

యస్మాత్సర్వతితోహం । అక్షరాదపిచోత్తమః ।
ఉత్కృష్టతమోక్షరాదపిచ । అమోఘోత్తమః ।
అక్షరపరబ్రహ్మణోపి । క్షరాక్షరాభ్యాంఅన్యః ॥

అనియున్నదిగనుక, మూలములేనియీాగుఱు తెలిఁగెడుశరీరమేమిలేనిదే యీాబట్టబయలు, ఇంతకంటెనెక్కువలేదు, మూలములేని యీాగుఱు తెలిఁగెడుశరీరమునకంటెఁదక్కువలేదు, మూలములేని యీాగుఱు తెలిఁగెడుశరీరమేమిలేదు, ఈబట్టబయలేయున్నది, మఱలనీబట్టబయలేయున్నది, మూలములేని యీాగుఱు తెలిఁగెడుశరీరమేమిలేదు, ఇదేభ్రాంతిరహితము, ఇదే రాజమార్గము. ఈశరీరమున్నదనెడుభ్రాంతిచేతనే, సర్వభ్రాంతులునుబుట్టుచున్నవి. సర్వకాలముచలించని యీాబట్టబయలునకేమిభ్రాంతియున్నది, మూలములేనియీాగుఱు తెలిఁగెడుశరీరమేమిలేదు, ఇఁకభ్రాంతియే

టికి, ఉన్నయీబట్టబయలునకేమియును లేదు, మూల
ములేనియీగుణుతెలిఁగెడుశరీరమేమిలేదు, ఒక్కటేవి
ధము, వ్యవహారము లేదు, చించినపత్రమెవ్వరియొద్ద
నున్న నేమిలేదుగాన, భయముతీరెను, సుఖదుఃఖములత
రితీఁపువదలెను, తీర్పుకానియెడలనెప్పుడైనముఖమున
లుపెక్కును, ఇప్పుడెక్కడుండినభయములేదు. చావుదే
నికి? పుట్టుకదేనికి? ఉన్నయచలమెప్పుడు నొక్కటేవిధ
ముగానున్నది, నేనేమిలేదు, నీవేమిలేదు. ఉన్నదానికినే
జోలిపట్టదు. అదిపుణ్యము చేయదు, పాపము చేయదు.
నేనునీవులేకుండినయదేయున్నది. లేనిదేమిలేకఁబోయె
ను. ఉత్తభ్రాంతిగదోయి, అనియిట్లందఱనెదరు, వి చా
రించితీర్చుడమైన భయముండదు, విచారించకుండిననే
మిఱంకోయనియనిపించును, విచారించఁగానున్నదియు
న్నట్లేయుండెను. లేనిదేమిలేకఁబోయెను. ఈబట్టబయలు
పుట్టదు, పుట్టించదు, భోజనముచేయదు, నీళ్లుత్రాగదు,
శుక్లములేదు, నెత్తురులేదు, రతిచేయదు, సహించదు,
కనుక సర్వక్రియాశూన్యమైనది. ఈబట్టబయలు, ఆఁ
డుదికాదు, మగవాఁడుకాఁడు, నపుంసకముకాదు, ఒ
క్కటియైనవికారములేదు, ఈబట్టబయలునకుశరీరము
గాని, రాకపోకలుగాని, కదలుటగానిలేక, సర్వకా
లమొక్కతీఱుగానే యున్నది.

అంతయునీబట్టబయలే,ఈబట్టబయలే,అచోద్యము అబాహ్యము,అక్లేశము.ఎఱుక అన్నియునుజూపితనకుఁ దానేపడిపోవుచున్నది ఈబట్టబయలేనిత్యము. ఇదేసర్వగతము, ఇదేస్థాణువు, ఇదేయచలము, ఇదే బహుకాలమునుండియున్నది, ఈబట్టబయలుకొట్టునదికాదు, కొట్టఁబడునదికాదు, ఎవఱినింగొట్టుచున్నది ఎవఱినింజంపుచున్నది, దీనికెఱుకలేదు,ఎఱుకలేనిదానికిచ్చబుట్టదు, దానియంతటివాఁడేదానినడుగవలయును, దానియంతదదియేఈబట్టబయలునకుబదులులేదు,నేనున్నానని యెఱుఁగదు,శరీరమున్నదని లేదనియెఱుఁగదు.అన్నియునుగలలోనిముచ్చట్లు. ఈబట్టయలునకెఱుకయును వికారమునులేదు, ఏజోలియెఱుఁగదు, మొదలుతుదలులేక నీబట్టబయలే యున్నదిగనుక నొక్కటియైన భ్రాంతియుండదు. తనకుఁదానే స్వతస్సిద్ధముగానున్నది. సర్వకాలముచలించక, ఉన్నదని లేదనియెఱుఁగక, దేనినింజూడక, ఏమిలేనిదేయున్నది. లేనిభ్రాంతియున్నదనుకొనుచున్నది,అదితీసివేసిన కొలఁదియేమిలేనిదేయున్నది. మొదలేయీబట్టబయలున్నది. సర్వకాలమేమిలేదనిమఱువకున్న నేమి బాధలేదనియనుకొనిన కొలఁదియున్నట్టుంటున్నదిగనుక, పొట్టుపంచుకొనున

ట్లుండును. మిగులనభ్యాసము చేసిన సంశయములు లేకఁ బోవుచున్నవి. ఉన్నదానికినొక్కటియైన, సాధనలేకనే తనకుఁదానేస్వతస్సిద్ధమైచలించక ,సర్వకాలమొకతీఱు గానేయున్నది. ఈశరీరముపుట్టకమునుపు, శరీరమున్న దేమి లేదు, ఈలాగునందనకుఁదానేదృఢము. సాధనచే యవలయునా, ఏమి లేదు. తనకుఁదానేదృఢము.

ఇతిగద్యా॥ శ్రీమద్గురుశివరామదీక్షితప్రభావే.
వేదాంతవిచారణే, ఉత్తరభాగే,
మూలప్రకృతినిరసన ప్రకరణం.
ప్రథమాధ్యాయః,





శ్రీసద్గురవేనమః.

# ఉత్తరభాగము.

## మహావాక్య స్వప్రకాశప్రకరణము.



సుషుప్త్యవస్థలేదు, జాగ్రదవస్థలేదు, స్వప్నావస్థలేదు, ప్రాజ్ఞావస్థలేదు, స్థూలసూక్ష్మకారణములులేవు,ఈయుత్తబట్టబయలునకునవస్థాదులు లేవు. మూడునాలుగులుపండ్రెండునులేవు.అన్నమయ,ప్రాణమయ,మనోమయ,విజ్ఞానమయ,ఆనందమయములను,పంచకోశములునులేవు.ఈయైదుకోశములులేని బట్టబయలునకు ప్రపంచమెన్నడునులేదు.ఈయుత్తబట్టబయలునకేమియునులేదు.ఇదేగురువాక్యము. జ్ఞానకర్మములయందాశగల్గినయెడల, అడవిలోఁగలసినకుక్కలవలె, రానుపోను భ్రమవిస్తరించును, పుట్టనిచావనిత్రోవ దొరుకదు. చావుపుట్టుకల భ్రమలెన్నటికినిలేవు. మాయపుట్టనే లేదు, ప్రపంచమునకు మూలమేమిలేదు, ఈయుత్త బట్టబయలునకునేమియునులేదు. ద్వాదశాతీరియైనకేవలాత్మ, ఆత్మపరమాత్మలుగావు, జీవశరీరములుగావు. ఈయుత్తబట్టబయలునకునేమియునులేదు, దీనివలననేమియునుబుట్టలేదు,జ్ఞానమనెడియెఱుకలేదు,అహంకా

రములేదు,ఎఱిఁగెడియెఱుక యనెడుమాయాచైతన్య స్వరూపిణి యెన్నడునులేనేలేదు. ఈయుత్తబట్టబయలే స్వతస్సిద్ధముగానున్నది, పుట్టనిచావని యీబట్టబయలెన్నడును, ఎఱుక స్వరూపముగాలేదు, ఇఁకమీఁదనుగాఁబోదు, రెండుప్రకారములుగానుండక, సర్వకాలమొకటేవిధముగానున్నది. ఈయుత్త బట్టబయలు ప్రపంచమునకుఁగారణముకాదు,తానేపుట్టనిచావనిది ప్రపంచము నేలాఁగునఁబుట్టించును, ప్రపంచమున్నదనుజాడయును లేదు, పుట్టనిప్రపంచమును విద్వాంసులున్నదని విచారించిన, పామరులకుసిగ్గుకాదా. మూలములేనిమాయయున్నదనువాఁడు, నిజగురుసాంప్రదాయకుఁడుగాఁడు, వాఁడేసంసారి, వాఁడేపామరుఁడు. వానికేవేదశాస్త్రములు, వాఁడేగురుమూలము విచారించనివాఁడు, ఈయుత్తబట్టబయలేమిలేదని, గురువాక్యమును జెప్పుకొనలేఁడు, ద్వాదశాతురియేగురువాక్యము, ఈవాక్యమును సర్వకాలముస్మరించవలయును. ఈయుత్తబట్టబయలే నిరంజనము, " అంజనంనామకిం " అంజనమనఁగానేమి? అంజనమనఁగా లేనియహంకారము. ఎఱుకయేజ్ఞప్తి, జ్ఞానమను ప్రపంచముతోడననుకొన్నాను. ఈయుత్తబట్టబయలునకు జ్ఞానమెన్నడునులేదు, ప్రపంచమునులేదు, బయలుమాత్ర

ము స్వతస్సిద్ధముగనున్నది, ఇది ప్రవేశించదు, వెళ్లిపోదు, ఏరూపమునుబొందదు, మనుష్యాకారమెన్నడును గాలేదు, ఇఁకనుగాఁబోదు, ఈయుత్తబట్టబయలే నిరంజనము. ప్రజ్ఞానమనెడి యొఱుకయే నిషేధము, కనుక జ్ఞానవాసనయే తగదు. ఈయుత్తబట్టబయలే పరిపూర్ణము దీనివలనంబుట్టని ప్రపంచము నేలాఁగునన్నదని జెప్పుదును, చెప్పనే జెప్పను, మీరున్ను జెప్పఁగూడదు, పుట్టని ప్రపంచమున్నదని చెప్పఁగోరాదు, ఈయుత్తబట్టబయలు సర్వకాలమున్నది.

“ ఏనపరమాత్మనా,ఛిదంతి వేదశాస్త్రాణి, ఏన, పరిపూర్ణం, ఏనపరమాత్మనాదహంతిపాతకాః, ఏనఅచలంపరిపూర్ణం । ఏనక్లేశాత్మాన । నశోషయంతిమారుతః । నిత్యంసర్వగతస్థాణుః। అచలోయస్సనాతనః। ” అనియున్నదిగనుక, ఈయుత్తబట్టబయలేయనినిశ్చయముగనమ్మి, చైతన్యమునునిషేధింపవలయును, అది లేని జ్ఞప్తి, లేనిమాయగనుక, లేని ప్రపంచము లేనే లేదని దృఢమైనన దేసరి. బట్టబయలుసర్వకాలమొకతీఱుగానేయున్నది, ఇది తప్పవేఱొక్కటి లేదు. లేనియొఱుకే ప్రపంచము ప్రపంచమే లేనియొఱుక, ఈయుత్తబట్టబయలేయున్నది, ఇదియే నిరాకారము, ఇదే నిర్గుణము, ఇదే నిర్వికారము, ఇదియండపిండబ్రహ్మాండాకారములెన్నడునుగా

లేదు, ఈయుత్త బట్టబయ లేయున్నది. ఎటుకే లేనిమాయ, ఎటుకే లేనిప్రపంచము, ఈయహంకారమే లేని మాయ,లేనిమాయ లేనే లేదు,లేనిమనస్సు లేనే లేదు,ఈయుత్తబట్టబయలునకును,ప్రపంచమునకును, సంబంధము లేనే లేదు,ఇఁకమీఁదనుసంబంధముగలుగనేరదు,సర్వకాల మొకతీఱుగానేయున్నది, ఇది రాకపోకలు లేనియచలముగనుక, " సచ్చిదానందస్వరూపిణీ శక్తిః, స్త్రీపురుషశ్చ," అనియున్నదిగనుక నీరెండును కేవలాత్మనలనంబుట్టనే లేదు, పుట్టనివాటిని యేమనిప్రాయుదును, ఈయుత్త బట్టబయలువలననొక్కటియైనను బుట్టనే లేదు, ఇఁకమీఁదను బుట్టంబోదు, ఏదిచూచినయచలస్వరూపమే, ఏదిమాట్లాడినయచలభావమే, బట్టబయలైనయచలముమాట్లాడదు, వేదశాస్త్రములప్రాప్తియే లేదు,కనుక, వేదశాస్త్రములనిషేధింపవలయును, సర్వకాలమునుత్పత్తిస్థితి, లయములకుకర్త మునుపు లేదు, ఇప్పుడును లేదు. అచలముజ్ఞానాతీతము గనుక నదిభుజించదు, రతిసలుపదు, కర్మములు చేయదు. ఇదిపరిపూర్ణాచలభావముగనుక, దీనివలన నహంకారము పుట్టనే లేదు, భ్రాంతియొవరికి, దీనియందు భ్రాంతియొన్నడును లేదు, ప్రపంచము పుట్టనే లేదు, మాయయెటువంటిదో, అటువంటివాఁడే దేవుఁడు. దే

వుఁడేపరమాత్మ, జీవుఁడేప్రత్యగాత్మ, ఈరెండును,అహంకారస్వరూపములే, అహంకారమువల్లనేజన్మము, జ్ఞానమువల్లనేబుద్ధి, లేనిమనస్సే జ్ఞప్తికి మూలమంట, అంతఃకరణము లైదును, ఎఱుకస్వరూపమే, కనుక ఈయుత్తబట్టబయలేయమృతము. అమృతమనఁగా జననమరణరహితము. అచలము పందిస్వరూపముకాదు,గాడిదస్వరూపముకాదు, కుక్క-స్వరూపముకాదు, మనుష్యస్వరూపముకాదు, ఏస్వరూపమున్నుగాదు, ఇఁకమీఁదనుగాఁబోదు, ప్రపంచమెన్నడును బుట్టనేలేదు, ఉత్పత్తి స్థితిలయములకు మూలముకద్దా, భ్రాంతికద్దా? ఈయుత్తబట్టబయలేపరబ్రహ్మమనియెఱుఁగరు, దీనికిమొదలు నడుమతుదలులేవు, జన్మమెన్నటికినిలేదు, ఇప్పుడునులేదు, ఇఁకమీఁదనులేదు, ఈబట్టబయలునకు జ్ఞానములేదు, కర్మములేదు, కర్తృత్వాదులులేవు, వర్ణాలంకారములునులేవు, ఇదినిరంజనమనుసాజ్ఞ.

జ్ఞానమని ప్రసిద్ధిమాత్రమేగాని, నిజగురుకటాక్షముచేత నాజ్ఞానమబద్ధమగుచున్నది. ఈయుత్తబట్టబయలేయని నిబంధనయుండిన,జ్ఞానముని షేధమేగనుక, జ్ఞానమునకు జన్మమెన్నడునులేదు. ప్రత్యగాత్మయనిన జీవుఁడే. జీవుఁడున్నాఁడనియనరాదు. పరిపూర్ణమువల

నఁబుట్టనేలేదు. శాస్త్రములచేతనే జీవుఁడులేఁడని తెలియఁబడుచున్నది. శరీరములో జీవుఁడున్నాఁడని యోచించినపాపాత్ములు, గురుమూలముగా వేదాంతశాస్త్రములను విచారించినవారుకారు. విచారించినవారికి నిబంధనలేదు. ఈయుత్తబట్టబయలునందు జీవుఁడేలేఁడు. జగత్తేలేదు. పుట్టనేలేదు. ఇఁకమీఁద పుట్టఁబోదు. జ్ఞానభ్రాంతి, కర్మభ్రాంతి, పుట్టినయెడల మునిఁగి నశించుటేసత్యము. అంతయుననుభవమే. మూలములేని యోగులు తెలిఁగెడు శరీరమున్నంతవరకుననుభవమే. ఈగులు తెలిఁగెడుశరీరమేమియును లేదు, అనినదాచింతించుచుండినంబుట్టనిచావనియచలము, స్వతస్సిద్ధమైయున్నదిగనుక, మూలములేని యోగులు తెలిఁగెడుశరీరముచేత నచలమిట్టిదనిజెప్పుటకు సాధ్యముకాదు. ఈయావరణము లేకుండినయెడల పుట్టని చావనియచలము స్వతస్సిద్ధమైయున్నది. మూలములేనియోగులు తెలిఁగెడుశరీరమును, విడిపింపఁజేసెడు గురుడుండినయెడల మిగులసులభము. ఈగులు తెలిఁగెడుశరీరములుచేసినగ్రంథములను జదివి, విని, నమ్మినయెడల, కొంతసేపు, అచలుఁడై, కొంతసేపులేక నిటులచంచలముగలవాఁడై, నేనేయచలమనుకొని నిద్రించి, తా

నా గ్రంథములతోఁడమునిఁగి, మఱల, మునుపటివలె భ్రమలచేత భ్రాంతినశింపక దఱిదోఁచక క్లేశపడును. అందుకే మూలములేని యీగుఱు తెఱఁగెడుశరీరమనెడి యావరణములేనివారినింజూచి, వారిముచ్చట్లు విని, వారినడతలుచూచి, వారిశిష్యులనుగాంచి, వారుశాంతమునువహించియున్నారో, లేక, శరీరమైయున్నారోయనివారిజాడగనుఁగొని, వారిదగ్గరకుంబోయి, ఈగుఱు తెఱఁగెడుశరీరము చేసిన, శంకరభాష్యమునునమ్మియున్నారో, లేకయితరభాష్యములను నమ్మియున్నారో, శాస్త్రవాసనలేక, ఇతరవాసనచేత నున్నారోయనిజక్కఁగావిచారించి, వారినింగాంచి, అయ్యా భూమండలమునందు మూలములేని యీగుఱు తెఱఁగెడుశరీరము లేనియచలస్వరూపులున్నారఁట, వారియాచారమేమి, వారి శాస్త్రములేమి, వారురారా, పోరా, వారిజాడయేలాఁగు? వారు పుట్టినారా లేదా? వారికింజావున్నదా లేదా; వారికిఁ గులగోత్రములున్నవా లేవా, వారేలాగునఁబుట్టిరి? వారికి వేదశాస్త్రములు ప్రమాణములా, అప్రమాణములా? వారికిందలిదండ్రులుభార్యబిడ్డలున్నారా, లేరా? వారిమూలమేమి? వా

రచలస్వరూపులను తెలాఁగనెను. వారెవ్వరో కాని వారి మూలము నాకుం దెలియదు. పుట్టనిచావనియచలమున్నదనిచెప్పి యేమి లేకపోయిరి. ఇదియేమని యడుగుదమనిననెక్కడఁజూచిన,నచలమేయున్నది, మొదలు లేదు, కొనలేదు, మూలములేనియీగుఱుతెఱిఁగెడుశరీరమేమియును లేదు. సముద్రములోనావమునిఁగినటుల యీభూమండలమునందు తానుమునిఁగిపోయెను.వానితోడనే వేదశాస్త్రము లేమి లేకపోయెను, ఆహా, ఏమి యాశ్చర్యము.

కలలోఁగనుపించెడు దేహములవలెనే, మూలములేనియీగుఱుతెఱిఁగెడు శరీరమేమి లేకపోయెను. కలలోనేనుఁగులెక్కడనుండివచ్చెను, ఎక్కడికింబోయెను, ఆలాఁగుననే, ఈగుఱుతెఱిఁగెశరీరములెక్కడనుండివచ్చెను, ఎక్కడికింబోయెను, ఎక్కడఁజూచినయచలమేకాని యేమిలేదు. ఈగుఱుతెఱిఁగెడు శరీరములేనందుననే యచలముపుట్టనిచావనిది. మూలములేనియీగుఱుతెఱిఁగెడుశరీరముననే సకలగ్రంథములు, శాస్త్రములను సిద్ధాంతములనునమ్మినయెడలరాకపోకలుతప్పవు, భ్రాంతిలేనిదోవదోయనుకుట కాఠిన్యము.మూలములేనియీగుఱుతెఱిఁగెడుశరీరమున్నదనిచెప్పినను, లేదనిచెప్పినను,

భ్రాంతిపోదు. అచలగురుసాంప్రదాయముదొఱికిననొక్కటియైనభ్రమయుండదుమూలములేనియోగులుతెలియఁగెడుశరీరము చెప్పినమాటలువినినయెడల మునుపటివలెనేరాకపోకలుకలిగియుండును, సకలనిశ్చయములు సకలసంశయములుబాధించుచుండును. ఆవరణములేనిగురుఁడుప్రాప్తించినయెడల, ఆవరణములేకుండఁజేయును. వినువారికిభ్రాంతిరహితముకానియెడల, చెప్పెడువారికేప్రయాసము. ఈయుపదేశమెవ్వరియొద్దనుదెలుసుకొనకతొలుతయచలగురునిచెంతఁజేరినశీఘ్రముగానబ్బును. శాస్త్రవాసనగలశిష్యుఁడాయెనేని, శాస్త్రములలోనున్నటులఁ జెప్పవలయును. వచ్చినవారియభిప్రాయములననుసరించిచెప్పుటయుక్తము, ఈరాజమార్గమునుజెప్పినయెడల బహుజనవిరోధము, మూలములేనియోగులుతెలిఁగెడు శరీరము చేసినమార్గములను జెప్పినవారేవిశేషజ్ఞులనిలోకులకుసంతోషము.

ఇందుకువాక్యము, " సత్యంజన విరోధంచ, అసత్యంజనరంజకం, " అనియున్నదిగనుక, మూలములేనియోగులుతెలిఁగెడుశరీరముతనవంటివారికే సమాధానము,నానామతములునానాశ్రుతులు,నానాశాస్త్రములునానాభాష్యములు,వారివారికిందగినటులయున్నవి.ఎవరివివారికేదొడ్డవనిచెప్పిసమాధానముచేసి, తమకుదమమూలము తెలియకయాచార్యస్వాములవారని పేరుపెట్టుకొనిరి.మఱికొందఱు, మూలములేనియోగు

ము తెలిఁగెడుశరీరమునాదియని మధ్యమతమునుగల్పించిరి. మూలములేనియోగులు తెలిఁగెడు శరీరములు మెచ్చుకొనునటుల శాస్త్రములుపలికినవి.ఇంతేకాని, పుట్టనిచావనియచలము శరీరము తెనిదిగనుక నేదానినిగురించిశాస్త్రములుచెప్పలేదు,శాస్త్రప్రకారము నడువకుండినలోకులకువిరోధము,అటులవిరోధమైనడువకుండిననుసరే, నన్నువిడువకుండిననుసరే, నావారనినాకు సంతోషము. నాకుమూలములేదు. ఎవరైననుమూలములేని యోగులు తెలిఁగెడు శరీరమున్నదనుటతప్పు. మూలములేనియోగులు తెలిఁగెడు శరీరములేనేలేదు. ఎప్పటికినియచలము స్వతస్సిద్ధముగానేయున్నది,ఇంతేకాని,ఏసాధన, ఏయుక్తి, ఏశ్రుతిపనికిరాదు.అచలము మొదలుకొనలేక, తనకుఁదానేస్వతస్సిద్ధమైయున్నదిగనుక, అచలమేశాశ్వతమైయున్నది, అచలముగాక రెండవదానికిమూలములేదు.

శ్లో॥ భ్రమేణాహం భ్రమత్వంచ। భ్రమేణోపాసకం మనః।
భ్రమేశేశ్వరభావత్వం। భ్రమమూలమిదం జగత్॥

అనియున్నదిగనుక భ్రాంతిరహితమునకై నిజగురుసన్నిధిచేరవలయుననితాత్పర్యము.

ఇతిగద్యా॥ శ్రీమద్గురుశివరామదీక్షితప్రభావే, వేదాంతవిచారణే, ఉత్తరభాగే, మహావాక్య స్వప్రకాశప్రకరణం ద్వితీయాధ్యాయః. సంపూర్ణం



శ్రీసద్గురవేనమః.

## ఉ త్త ర భా గ ము.

## అమలప్రకాశిక ప్రకరణము.



ఈపరిపూర్ణము వలన భగవానులు పుట్టనేలేదు. పుట్టని చావనివాఁడని గీతలోనున్నది, పుట్టనిచావని వాఁడైనయెడల ఱేపల్లెలోనేలాఁగు పుట్టెను, పదునాఱువేలు గోపికాస్త్రీలతనికి భార్యలనెడు మాటలకు మూలములేదు, ఈపరిపూర్ణమే పుట్టనిచావని పరబ్రహ్మము, అత్యంత విలక్షణము, ఈమాటసమస్త దేశములవారును జెప్పుకొనుచున్నారు. తానెఱుఁగఁడు జ్ఞానాజ్ఞానములులేనివాఁడు, ఆదిమధ్యాంతశూన్యుఁడు, తానెక్కడను నిండియున్నాఁడు తనకు మొదలులేదు, నడుములేదు, కొనలేదు. ఈపరిపూర్ణమెప్పటికినేలాగో, ఆలాగుననే యున్నది. తురకలు పంది వలన, బ్రాహ్మణులు బల్లివలన, నక్కవలన నారాయణుండునుబుట్టిరి. కుక్కవలన నీకోతులుపుట్టినవి. ఈనిరాకారము వలనప్రపంచము పుట్టనేలేదు. ఎవ్వరెఱుఁగరు, అభిమానమేపంది, కోపమేకుక్క, జిత్తేచిత్తము. కుక్కవలె కఱవవచ్చునదియేమో, కోపగించి కొట్టవచ్చునదియేమో, చేష్టలన్నియునుకోతిచేష్ట

లే. కుక్క చేష్టలుకొన్ని, ఊరఁబంది చేష్టలువిస్తారము, అందువల్ల నేతురకలకు దానిమీఁదం గోపము· ఏదిమొదటయున్నదో. అదియేపందినిపుట్టించునది, అదియేమనుష్యునింబుట్టించునది, అచలమునిర్గుణ నిరాకారమగుటవలననదిపందిరూపముకాలేదు. మనుష్యరూపమునుగాలేదు. ప్రపంచరూపమునుగాలేదు. వీటినిఁబుట్టించనులేదు. ఈయూరఁబందియెవరివల్ల పుట్టినదో, ఆవుకొడుకు బసవన్నయెద్దుసాంప్రదాయము, ఛీఛీ, మొదలుచక్కనైన, కొనయునుజక్కనే, మొదలువంకరమైన, కొనయునువంకరే, ఈపరిపూర్ణముమాత్రము సిద్ధము, ఇది చావుపుట్టుకలులేనిది, ఇంతకంటెనెక్కువలేదు. సర్వకాల మొక్కటిగానేయున్నది, ఇప్పుడును బుట్టలేదు· ముందరను, బుట్టంబోదు· అభిమానమే యూరఁబంది, పందిపుట్టుకనెఱిఁగిన వాఁడేగురుఁడు, ఈపరమాత్మయే పరమాత్మ, ఈపరిపూర్ణమేపరిపూర్ణము, దీనివలనప్రపంచమెన్నడునుబుట్టనే లేదు. సర్వకాలము నీపరిపూర్ణమేయని శంకరాచార్యులవారినిమ్మక్ష, స్వామిజియ్యరును, సర్వకాలము నీ పరిపూర్ణమేయనిచెప్పిరి, మొట్టమొదట పరిపూర్ణమేయున్నది. జ్ఞానము కోటిశాస్త్రములవల్లను ఛీఛీ యనితీసివేయబడినది, అహంకారము లేకుండినయె

డల జ్ఞానమే లేదు. సర్వకాల మెడతెగక, ఈపరిపూర్ణమే యున్నది, అహంకారమెన్నడును లేదు.

"యత్రనాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి, నాన్యద్విజానాతి తత్స్వయంభూః"

అనువాక్యమునుబట్టి యదియే, కేవలపరిపూర్ణము. జ్ఞానాజ్ఞానములు మొదలైన ద్వంద్వములు నిషిద్ధములు గనుక, ఈపరిపూర్ణమే లెస్స, ఇంతకంటెను దొడ్డదిలేదు. శాశ్వతమైనది, ద్వైతాద్వైత రహితమైనపరతత్వము. ఈపరిపూర్ణమునకు నేదియునులేదు. ప్రకాశ విమర్శ రహితమైన పరతత్వముగనుక ప్రపంచము పుట్టనేలేదు. సమయాచారము దొడ్డది, కర్త లేదు గనుక, ఎవనింగూర్చియైనిషేధము. ఈపరిపూర్ణమునకు నేమియునులేదు. వేదశాస్త్రసారము సంపూర్ణము.

ఈయుక్త పరిపూర్ణమే పరమపురుషుఁడు, ఇతని వలన క్షేత్రజ్ఞుఁడను జీవుఁడు పుట్టనేలేదు. క్షేత్రమనెడు శరీరమును బుట్టలేదు. అంతయును బుట్టని చావని పరిపూర్ణమే, అత్యంత విలక్షణమై యున్నది. పుట్టనిచావనిది గనుక, ప్రపంచమునుబుట్టనే లేదు. భగవానుఁడు కల్పితుఁడు, కవీశ్వరుఁడు పుట్టిపట్టాభిషేకము చేసెను, పురాణముల ప్రమాణములే. వేద

ములు పట్టిమాటలే కనుకనివియేలాఁగున నబద్ధమో, ఆలాఁగున నన్నియు నబద్ధములే. పరమాత్మ వలన నహంకారము పుట్టనేలేదు. ఈయుత్తపరిపూర్ణమేస త్యము,పుట్టనియహంకారప్రపంచములురెండును అస త్యములు, మతములు, అడవిలోని త్రోవలు, ఛీఛీ, వా టినిం దలంపరాదు, అహంకారపుచవి, యహంకా రముతోనేఁబోయెను, అదిపుట్టనిచావని మార్గము కాదు, శరీరము పుట్టకమునుపు, పుట్టినవెనుక, కాలి పోయిన తరువాత నీయుత్త పరిపూర్ణమేయున్నది. ఇది పుట్టనిచావని పరిపూర్ణము గనుక, చలించకనే యున్నది, పరిపూర్ణమునకు శరీరమెన్నఁడును లేదు. జీవుఁడు పుట్టనేలేదు. ఈపరిపూర్ణమే సరి. ఈపరిపూర్ణ మే ప్రభుస్వామి. ఈస్వామివలనం బ్రపంచము పుట్ట నేలేదు. పుట్టినదని. కవీశ్వరులు చేసిన లీలలు, వారి కే యెఱుక, శైవసిద్ధాంతములు ప్రపంచము పుట్ట లేదని చెప్పుచున్నవి, ప్రభుస్వామియనిన, ప్రభువని న, పరమ పదమనిన, పరిపూర్ణమే, ఈపరిపూర్ణము వ లన, శక్తియును శివుఁడును బుట్టనేలేదు. అంతయునీ యుత్తపరిపూర్ణమే పుట్టనిచావనిచైతన్యము నేనేలా గుననున్నదనిచెప్పుదును,ఛీఛీపుట్టనిచావనిపరిపూర్ణమే

యున్నది, గీతాభాష్యములలో, నీయుక్తపరిపూర్ణమే యున్నదని, శంకరాచార్యులవారు చెప్పిరి. సూత్రభాష్యమందును బుట్టని చావనియీపరిపూర్ణమే యున్నది. ఉపనిషద్వాక్యములయందు, పుట్టనిచావని వాడేపరబ్రహ్మమని, అమృతమని, కారణ కార్యములు లేకనున్నదని, సదసత్తులుగానిదనియున్నదిగనుక, పరిపూర్ణమునే మొదట చెప్పవలయును. పరిపూర్ణమువలనం బుట్టని క్షేత్రజ్ఞ క్షేత్రములను జెప్పరాదు. పరిపూర్ణమే పరమపురుషుఁడు. ఈయుక్తబట్టబయలున కేమియును లేదు. పుట్టనిచావనివాఁడే పరమపురుషుఁడు, అతఁడే విలక్షణుఁడు. అహంకారమే జ్ఞానాజ్ఞానములు.

ఇతిగద్యా॥ శ్రీమద్గురు శివరామదీక్షితప్రభావే,

వేదాంతవిచారణే, ఉత్తరభాగే,

అమలప్రకాశిక ప్రకరణం

తృతీయాధ్యాయః.

సంపూర్ణం





శ్రీసద్గురవేనమః.

## ఉ త్త ర భా గ ము.

## అమృతసారప్రకరణము.



ఈయుత్తపరిపూర్ణము తనకుఁదానే స్వతస్సిద్ధమై చలించకనున్నది. ప్రపంచముపుట్టనేలేదు. ఇదేనిజగురూపదేశము. ఈయుత్తనిర్మలమేపరిపూర్ణము. నిజగురుకటాక్షములేక, నదికానలేరు, " ఆచార్యస్వరూపనివేద్యం" అనియున్నది " ఖంబ్రహ్మ " అనిసిద్ధాంతవాక్యములుండనేయున్నవి గనుక, ఉన్నభ్రాంతిమొదటిది కాదు, మొదలేదియున్నదో, నదిచెప్పినవాఁడేగురుఁడు, పుట్టనిచావనిగురుఁడుకావలయును, శరీరమైయున్నగురుఁడుపనికిరాఁడు, అహంకారమైయున్నగురుఁడుపనికిరాఁడు, పుట్టనిచావనిది యేదియో, యదిసత్యమనిచెప్పేఁడుగురుఁడుకావలయును. జ్ఞానమార్గమునిషేధమేకర్మమార్గమునునిషేధమేగనుక, పుట్టనిచావనియీపరిపూర్ణమునేమొదటచెప్పవలయును. పుట్టనిప్రపంచముయొక్కజోలేకూఁడదు. ఈయుత్తపరిపూర్ణమువలన మాయపుట్టనేలేదు, గనుక నీయుత్తపరిపూర్ణమేయున్నది. ఈయుత్తపరిపూర్ణమేయత్యంతవిలక్షణము. ఈయుత్తపరిపూర్ణమువలన అక్షరమనే, చైతన్యస్వరూపిణియనుమాయపుట్టనేలేదు, గనుకనీయు

త్తపరిపూర్ణము తప్పమరేమియునులేదు, క్షరమనెడు శరీరమేలేదు, ఈయుత్తపరిపూర్ణమేయున్నది, ఈయుత్తపరిపూర్ణము పుట్టదు పుట్టించదు అందుకేప్రపంచముపుట్టనేలేదు ఈయుత్తపరిపూర్ణము మాట్లాడదు, ఈయుత్తపరిపూర్ణమునకు నెక్కటియైనను బాధలేదు, జన్మములేదు, జన్మములేకుండిన యహంకారమునులేదు, ఈపరిపూర్ణమే యున్నది, ద్వంద్వములు పుట్టనేలేదు, ఈయుత్తపరిపూర్ణమే యున్నది, అహంకారము లేకుండినప్రపంచ భ్రాంతియెవ్వరికున్నది, ప్రపంచమెక్కడున్నది, ఈయుత్తపరిపూర్ణమునకునేమియునులేదు, ఈయుత్తనిర్వికారమేపరిపూర్ణము, ఈవాక్యములనుసంతతము మఱువకమనస్సునన్నుంచవలయును. ప్రయత్నముగొంచెమనక చేయవలయును. ఈయుత్తపరిపూర్ణమేయత్యంతవిలక్షణము.విలక్షణమువలన వికారముపుట్టనేలేదు, సదసత్తులనెడు ద్వంద్వములజోలేలేదు. ఈయుత్తపరి పూర్ణమునకేమిలేదు, ఇదేనిజగురువాక్యముమొదటియుపదేశము. పుట్టనిచావనివాఁడేపరబ్రహ్మము, పుట్టనిచావనిదేయమృతము. అత్యంతవిలక్షణమువలన ప్రపంచముపుట్టనేలేదు. ఇదేమహారహస్యము, ఇదేరాజగుహ్యము, ఇదే పరమగుహ్యము.

అనాధికారులకుం జెప్పరాదనినేమనమున్నది, పుణ్యమునందిచ్ఛగలవారికిం జెప్పరాదు, పాపమునంది

చ్ఛగలవారికిం జెప్పరాదు, వారునిజగురుసాంప్రదాయకమెఱుఁగరు, ఈపరిపూర్ణభావమున్నదనియెఱుఁగరు,అన్నికులములవారికినుత్పత్తి స్థితిలయములు కలిగేయున్నవి. అప్రమాణమునకే వేదప్రమాణము. ఈయుక్తపరిపూర్ణమేపుట్టనిచావనిది, జ్ఞానాజ్ఞానములు శూన్యము, ఈయుక్తపరిపూర్ణమేనిర్బంధము, ఇదిసంతతమునుమఱువక మనస్సుననుంచవలయును. ఈయుక్తపరిపూర్ణమువలనసత్తుపుట్టదు, అసత్తునుబుట్టలేదు. ఈయుక్తపరిపూర్ణమేనిరంజనము, ఈయుక్తపరిపూర్ణమేనేను. నేనేపరిపూర్ణము.అత్యంతవిలక్షణమేస్వరూపము "ఛిదంతి సర్వశాస్త్రాణి" అనియున్నదిగనుక, సమస్తశాస్త్రములనువిడువ వలయును. ఈయుక్తపరిపూర్ణమేనత్యంతవిలక్షణము. మొదలుతుదలుగలిగినదే లేనిమెఱుక. శ్రుతిః ॥ యూనివర్తంతే, నిరాహారస్వదేహినాం రసవర్జిష్టతమం. అనియున్నదిగనుక, ఈయుక్తపరిపూర్ణమువలన, వేదములు భగవద్గీతలుపుట్టనేలేదు. ఈయుక్తపరిపూర్ణమునకు, జ్ఞానాజ్ఞానములు విద్యావిద్యలు, సదసత్తులనెడు ద్వంద్వములుపుట్టనేలేదు గనుకనీపరిపూర్ణమేనత్యంతవిలక్షణము. ఈయుక్తపరిపూర్ణము బహుకాలమునకుమునుపేయున్నది. ఈవాక్యమునుమఱువక సంతతము మనస్సుననుంచవలయును,ఘట్టిగేయేమియునుదోఁచదు, క్షరముపాపమే, అ

కరముపాపమే, ఈయుక్తపరిపూర్ణమేమిలేని నిరాకారము, నిర్గుణము, నిరంజనము.

శ్లో॥ నిర్గుణో నిష్క్రియో నిత్యో । నిర్వికారో నిరంజనః ।
నిర్వికారో నిరాకారో । నిత్యముక్తోస్మి నిర్మలః ॥

అనియున్నదిగనుకను, శ్రుతిః॥ అదీర్ఘమజమవ్యయం। అరూపగుణవర్ణాఖ్యం। తద్బ్రహ్మేత్యవధారయేత్॥ అనియున్నదిగనుకను, బ్రహ్మయట, విష్ణువట, మహేశ్వరుడట, ఛీఛీ, లోకులమాటలు కాకులకూతలు

ఇతిగద్యా॥ శ్రీమద్గురుశివరామదీక్షితప్రభావే.
వేదాంతవిచారణే, ఉత్తరభాగే,
అమృతసారప్రకరణం,
చతుర్థాధ్యాయః,
సంపూర్ణం.





శ్రీసద్గురవేనమః.

# ఉ త్త ర భా గ ము.

## కారణాకార్యరహిత ప్రకరణము.

నైదీకులు పరబ్రహ్మమే జగత్కారణంబని వాదించిరి, శైవులు శివుఁడే జగత్కారణంబని వాదించిరి, వైష్ణవులు శ్రీమన్నారాయణుండే జగత్కారణంబని వాదించిరి, శాక్తేయులు శక్తియే జగత్కారణంబని వాదించిరి, ఇదేప్రకారము సర్వమతములవారును, వారివారి మతదేవతలే జగత్కారణంబని వాదించిరి, కారణము,కార్యము. కారణకార్యముల కెన్నటికిని భేదములేదు, కారణమున్నంతవరకు కార్యముండక పోదు. కారణము నిజమైనయెడల, కార్యమును నిజమే. కారణ మబద్ధమైనయెడల, కార్యము నబద్ధమే. కారణము విత్తువంటిది, కార్యము చెట్టువంటిది, కారణమునకు, కులములేదు, గోత్రములేదు. కారణమునకు, కులగోత్రము లుండిన, కార్యమునకు నుండును. కారణము దేవుఁడైనయెడల, కార్యమును దేవతాస్వరూపమే. గురువు, దేవత, ఆత్మ, ఇవిమూఁడు నహంకారస్వరూపములే యగుటచేతను, నేను నేననెడి, యనుభవమున్నయుండుటచేతను, సోహంసోహమని జీవేశ్వరులకు నైక్యసమాధి గలిగియుండుటచేతను, కార్యకారణములు, రెండును నొక్కటే. అహంబ్రహ్మాస్మి యనెడి యనుభవము వేదమందున్నది గనుక నేనేజీవుఁడను, నేనేయీశ్వరుఁడను, నేనేబ్రహ్మము,

నేనేసర్వము, నాకంటె నన్యములేదు. నేనుండిన సర్వ మునున్నది, నాకునేనేమూలము, నేనేగురుఁడను, నేనే శిష్యుఁడను, నేనేదారను, నేనేదొంగను, నేనేకురుసా ల వాఁడను, నేనేదొరసానిని, నేనేసర్వమును, సర్వ మునునేనే, నాకునేనేమూలము, గనుక, నేను నేనన డి యహంకారము వల్లనే సర్వమును. శరీరములు, ఖరములకు, సూకరములకు, శునకములకు సమాన ములే. పుట్టనిచావని యచలము, సర్వకాలము చలిం చక నొకతీఱుగానే యున్నది. ఈగుఱు తెఱిఁగెడి యె ఱుక నేనని యనుకొనువాఁడ ధముఁడు. శరీరము నేననియను కొనువాఁ డధమాధముఁడు. ఈరెండును లేకనున్నవాఁడే, పుట్టనిచావని యచలము. అచలమే గుణములులేనిది, వికారములేనిది, తానది కావలె నంటె నెన్నిటికినిగాఁడు, సాధ్యాసాధ్యములు లేనిది గనుక, ఉన్నయచలమునకు శరీరములేదు గనుక నే మియునుజేయదు, చేయించదు. సకలతిప్పలు నీగుఱు తెఱిఁగెడి యెఱుకకే. ఈశరీరములేని యచలమునకు, చలన మెన్నటికినిలేదు, ఎఱుకలేదు, మఱపులేదు, ఎ ఱుకమఱపులకునెఱుకేకారణము, నిజగురుకటాక్షము చేత నతిసులభము, జ్ఞానకర్మములచేత, బహుక్లేశము, ఎన్నటికినిం దెలియఁబడదు, కాఁబట్టి, శీఘ్రముగా, కార్యకారణములు లేని గురుసాంప్రదాయకమును వెదకి కనిపట్టి, శరీరములేని యచలము కావలయు

ను. అటులైన సర్వకాల మొకటీరె, జన్మకర్మభ్రాంతులు జ్ఞానము వెంటనే బోయెను. ఉన్నయచలమునకు జ్ఞానములేదు, కర్మములేదు. జ్ఞానముచేతనే కర్మము పుట్టుచున్నది. జ్ఞానమే యహంకారము గనుక, సర్వకాల మచలము, శరీరము లేకనున్నదో, శరీరము కలిగియున్నదో, నేను నేననెడి యెఱుకైయున్నదో యనివారిదగ్గరకుం బోయిచూచి, అచలము చలించకనున్నటులవారి యునికియున్నదో లేదోయని విచారించ వలయును. శరీరమై యుండినయెడల వారిసాంప్రదాయము బ్రహ్మజ్ఞాన సాంప్రదాయ మేమోనని మాట్లాడవలయును. జ్ఞానులైనను శాస్త్రములత్రోవ ననుకొనువారే మధ్యములు, పుట్టనిచావని యచలసాంప్రదాయ మెటువంటిదని వారిని యడుగవలయును. క్షరము శరీరము, ఈగుణుతెలిగెడి యెఱుకయనేయాత్మ, అక్షర పరబ్రహ్మము, క్షరాక్షరోపాధిద్వయదోష రహితమైనది యొక్కడున్నది, అదినేనేలాగుకాను, అదిశరీరము లోపలనున్నదా, శరీరమునకు బైటనున్నదా, దానికియాత్మకు సంబంధమున్నదా, లేదా, ఈమూడు ప్రశ్నలు భగవానులు చేసిరి. అది యీశరీరముకాదు, విలక్షణ మనెడియెఱుక కాదు, ఈరెంటికి నన్యమైన మూడవది యేదియో, యదే, యిరువది యూటవది, అదిశరీరమందు లేదు. ఈ శరీరమందున్న యిరువదియైదు తత్వములు లేకుండి

నయుచలమే యున్నది. దానికియెఱుక మఱుపులు లేవు.
నిజగురు సాంప్రదాయకము చేత నదిసూచనకావల
యును, తనప్రయత్నము సూచనయ్యే పర్యంతము
లెస్సగానుండ వలయును, ఉన్నకొలఁది సకల సందే
హములకు మూలమేదియో యదిలేకపోవును, స
ర్వజ్ఞత్వముండిన యెడల, మునుపటివలెనే యుండును,
గనుక, సర్వకాలము గురువాక్యమును విడువక
నభ్యాసము చేయవలయును, చేయునది యేమనిన,
అశ్రద్ధ యున్నయెడల మనస్సునకు విశ్రాంతికలుగక,
కుక్కవలె చలించుచుండును, జ్ఞానముచేతకర్మములు
విడువకున్నటులయుండును, గనుకమూలములేని యీా
గుఱుతెఱిఁగేశరీరమను యెఱుకేమిలేదని సంతతమువి
డువక, సమస్తకార్యములయందుండవలయును. భోజ
నకాలమందును, రతికాలమందును, నడిచేకాలమం
దును, కూర్చుండినకాలమందును, నిద్రవచ్చునంతవ
రకు, మఱువకనభ్యాసముచేయుచు, సర్వమునుజేయు
కవిడువక శరీరములేకుండనుండవలయును, ఈలాఁ
గున్నవారే మేలుకొనినవారు, ఇటువంటివారికిపు
ట్టుకయును, చావునులేదు. సర్వకాలమొకతీఱుగానే
యుందురు, గనుకనది తానుగావలెననువాఁడు లేకఁబో
యెనుఅదియెవ్వరునుగాలేదుఉన్నదియున్నట్టుగానేయు
న్నది(నిర్ణయోనాస్తిసర్వదా॥ అనుప్రమాణమునుబట్టి.
శ్రీమద్గురుశివరామదీక్షితప్రభావే, వేదాంతవిచారణే,ఉత్తరభాగే.
కారణాకార్యరహితప్రకరణం, పంచమాధ్యాయః. సంపూర్ణం॥



శ్రీసద్గురవేనమః.

# ఉ త్త ర భా గ ము.

## భావాభావరహితప్రకరణము.



సర్వదామాం, అహంప్రత్యక్చైతన్యాఖ్యః, మాయారహితత్వాత్, తస్మాత్, కదాచిత్, మాయానవేదితం,అదర్శనస్వభావాత్, అవ్యక్తమితిప్రసిద్ధమేవ అవ్యక్తంనామఅదర్శనం అదర్శనాత్ పునర్దర్శనం. గతాఇతిశ్రుతే. విద్యుదభ్రనిమేషవత్, పరుషవత్, పాషాణాగ్నివత్,వసంతకాలేగహనే అగ్నిజాతవత్,ఖద్యోతవత్, తస్మాత్, సర్వదాఅంతరేనాస్తి, బాహ్యేనాస్తి, ద్వైతాపేక్షయా, కాష్టాదిసహాయేన, సామర్థ్యత్వేన, జాత,ఛిదగ్నివత్, స్వయంప్రకాశమానత్వాత్, ఉష్ణస్వభావాత్, దాహకసామర్థ్యత్వాత్, యావత్పరియంతమస్తి, తావత్పరియంతమేవప్రగల్భః తత్ చిదగ్నిః, తస్యమూలంనాస్తి, ఆగంతుకత్వాత్, సామర్థ్యత్వేన ప్రసిద్ధః యావదస్తితావత్పర్యంతమేవ, అస్తీతిభ్రమా, విచారరహితత్వాత్, విచారేణ, అస్తీతిసర్వశూన్యమేవ, గర్జితవత్, శంఖనాదవత్, భేర్యాదివాద్య విశేషవత్, అట్టహాసవత్, దుఃఖవత్, ఉదరరోగవత్, తద్వత్, కదాచిత్కమేవ చిదగ్నిః, అసదృశత్వాత్, శశివిషాణవత్, వంధ్యాపుత్రవత్, ఖపుష్పవత్, నరశృంగవత్, తస్మాత్ మిథ్యాజ్ఞానేనమిథ్యాభ్రాంతిః, మిథ్యాజ్ఞానస్యలక్షణం,

క్షేత్రాధికోనామకిం, శరీరాదికిం, జానాతివేత్తివిజా నాతి, విజ్ఞానంచప్రసిద్ధమేవప్రత్యగాత్మేతి. ప్రకృతిపురు షేతి, కూటస్థేతి, బ్రహ్మేతి, ఆత్మేతి, క్షేత్రజ్ఞేతి,సచ్చి దానందేతి, పరమాత్మేతి, పరమేశ్వరేతి, ద్రష్టేతి, శ్రుతీతి, విజ్ఞానేతి, ఏతాదినిమిత్తజ్ఞానస్వరూపాణి, జ్ఞా నమేవ జీవోపాధిః తస్యైవ, అద్వైతసాజ్ఞా, నిర్గుణ సాజ్ఞా,మాయావిద్యేతిసాజ్ఞా,తస్మాత్, వేదేనసవేదితం, మిథ్యేతిదృఢాభ్యాసః, తదాచిజ్జడభ్రాంతిరహితం.జన్మా దిభ్రాంతిరహితస్య, సర్వశూన్యత్వాత్, సర్వశూన్య మితి, దృఢనిశ్చయమేవ, విచారస్యఫలం, సఏవ, బం ధమోక్షరహితః. జ్ఞానాజ్ఞానరహితత్వాత్, అతీతంకో వేద, అంధపురుషవత్, అలంవిస్తారభయాత్.

సుఖోహమస్మీతి. వేదరహితే నవేద, తత్సమయే, అహంవృత్తిశూన్యత్వాత్, సుఖంకోవేద, దుఃఖంకో వేద, జ్ఞానస్యమూలంకిం, అజ్ఞానస్యమూలంకిం, కోవే ద,అహంవృత్తేః జీవోపాధిః విలయేసతి, సమస్తవేదాః కోవేత్తి, అహంమాయేతి, తదామదితి, అహమితి త్వమితి, జ్ఞానమితి, అజ్ఞానమితి, భేదమితి, బ్రాహ్మణో హంచండాలోహమితి, సగుణనిర్గుణవ్యవహారే, నివృ త్తిస్వభావాః, పురుషసమయే, ఘటాటోపవత్, స్వకా లేసత్యవద్భాతి, అగ్నివత్, సూర్యవత్, చంద్రవత్, తద్వత్కదాచిత్కమేవజ్ఞాపకః, కదాచిత్కమేవఅంధ కారవత్, జ్ఞాపకరహితః, విచారరహితః, ఉభయర

హితః,అహంవృత్త్యాఖ్యజ్ఞాపకరహితత్వాత్, సర్వశూన్యమస్తీతినిశ్చయం, అహమేవజీవోపాధిసహితః, తస్మాత్, తద్విచారవత్, సర్వదా, ఇదమేవవిచారః, ఇదమేవగురూపదేశః, వ్యవహారకాలే, భోజనకాలే, తద్దృఢాభ్యాసః, అయమేవచిజ్జడరహితః, క్షేత్రక్షేత్రజ్ఞరహితః, సగుణనిర్గుణరహితః, ప్రకృతిపురుషరహితః జగజ్జీవరహితః,సదసద్రహితః,జ్ఞానాజ్ఞానరహితః, భేదాభేదరహితః, పుణ్యాపాపరహితః, ధర్మాధర్మరహితః ప్రవృత్తినివృత్తిరహితః, జీవేశ్వరరహితః,కూటస్థబ్రహ్మరహితః, బాహ్యేసర్వశూన్యమితిశ్రుతిః, అంతరేసర్వశూన్యమితిశ్రుతిః, అయమేవసర్వేషాం. భావాభావరహితః.

ఇతిగద్యా॥శ్రీమద్గురుశివరాదీక్షితప్రభావే, వేదాంతవిచారణే, ఉత్తరభాగే, భావాభావరహితప్రకరణం షష్ఠమాధ్యాయః, సర్వంబును, సంపూర్ణం,



## భావాభావరహితప్రకరణ టీకా.

టీకా॥సర్వదా=ఎల్లప్పుడును,మాం=నన్ను,అహం=నేను. ప్రత్యక్షైచ్ఛతస్వాఖ్యః = అచలపరిపూర్ణబ్రహ్మమనిచెప్పంబడుచున్నాను.మాయారహితత్వాత్ =మాయారహితమగుటచేత,తస్మాత్ = అందువలన, కదాచిత్ = ఒకప్పుడును, మాయానవేదితం = మాయను తెలియఁబడదు, అదర్శన స్వభావాత్ = మాయ తెలియఁబడనిస్వభావమగుటచేత, అవ్యక్తమితిప్రసిద్ధమేవ = ఎఱుఁగబడనిదని ప్రసిద్ధమే, అవ్యక్తన్నామ అదర్శనం= అవ్యక్తమనఁగాఅదర్శనమే,అదర్శనాదవతరతి పునర్దర్శనం=

అదర్శనమగుటచేతనే మణుల దర్శనమగుచున్నది, గతా ఇతి శ్రుతేః = ఈరెండునుతోయబడినవని శ్రుతిపలుకుటచేత, విద్యుదభ్రేనిమిషవత్ = మేఘమునందు నిమిషనిమిషమునకు రాకపోకలుగలిగిన మెఱుపుతీగలవలెను, పరుషవత్ = ఉత్సాహకాలములయందు అలంకారముతోకూడుకొనిన మనుష్యులవలెను, పాషాణాగ్నివత్ = రాతియందలి నిప్పువలెను, వసంతకాలేగహనేఅగ్నిజాతవత్ = వసంతకాలమునయడవియందుపుట్టిన కార్చిచ్చువలెను, ఖద్యోతవత్ = మిణుగురుపురుగులవలెను రాకపోకలుకలిగియుండుటచేత, తస్మాత్ = ఆకారణమునుబట్టి, సర్వదా = ఎల్లప్పుడును, అంతరేనాస్తి = అంతరములేదు. బాహ్యనాస్తి = బాహ్యములేదు, ద్వైతాపేక్షయా = ద్వైతాపేక్షచేత, కాష్ఠాదిసహాయేన = కట్టెలసహాయముచేత. మర్దనేన = మర్దించుటచేత, జాత = పుట్టెడు, అగ్నివత్ = అగ్నివలెనే; చిదగ్ని = జ్ఞానాగ్నియును, స్వయంప్రకాశమానత్వాత్ = తనకుఁదానేప్రకాశించుటచేతను, ఉష్ణస్వభావాత్ = ఉష్ణస్వభావముకలిగియుండుటచేతను, దాహకసామర్థ్యత్వాత్ = దహింపఁజేసెడు సామర్థ్యముకలుగుటచేతను, యావత్పర్యంతమస్తి = ఎంతపర్యంతమున్నదో, తావత్పరియంతమేవ = అంతపర్యంతమే, ప్రగల్భః = ప్రకాశము, తచ్చిదగ్నిః = అదియేచిదగ్ని. తస్యమూలంనాస్తి = దానికిమూలములేదు. ఆగంతుకత్వాత్ = ఉన్నట్టుండివచ్చుటచేత, సామర్థ్యేనప్రసిద్ధః = దానిసామర్థ్యముచేతనే ప్రసిద్ధమైనది, యావదస్తి తావత్పర్యంతమేవ = ఎంతవఱకున్నదో అంతవరకు, విచారరహితత్వాత్ = విచారణలేకుండుటచేత, అస్తిభ్రమః = ఉన్నదనెడుభ్రమ, విచారణేన = విచారించుటచేత, సర్వశూన్యమేవ = ఏమియునులేనిపరిపూర్ణమే, అస్తీతి = ఉన్నది. గర్జితవత్ = మేఘనాదమువలెను, శంఖనాదవత్ = శంఖనాదమువలెను, భేర్యాదివాద్యవిశేషవత్ = భేరిమొదలగు వాద్యవిశేషములవలెను, అట్టహాసవత్ = పకపకయనినవ్వెడునవ్వువలెను, దుఃఖవత్ = ఏడ్పుటరీతిగాను ; ఉదరరోగవత్ = కడుపునొప్పివలెను

తద్వత్ = అదేప్రకారము, కదాచిదేవ=ఒకానొకప్పుడుతో చునట్టిదే, చిదగ్నిః=జ్ఞానాగ్ని. అసదృశత్వాత్ = సాదృశ్య ముగాకుండుటవలన. శశివిషాణవత్=కుందేటికొమ్ములవలెనె సంధ్యాపుత్రవత్ = గొడ్రాలిబిడ్డవలెనె, ఖపుష్పవత్=ఆకాశ పుష్పమువలెనె, నరశృంగవత్=నరునికొమ్ములవలెనె, తస్మాత్ =కనుక. మిథ్యాజ్ఞానేన = దబ్బరయైనజ్ఞానముచేత, మిథ్యా భ్రాంతి=దబ్బరయైనభ్రమ, మిథ్యాజ్ఞానస్యలక్షణం = అబద్ధ మేజ్ఞానమునకునాధారము. క్షేత్రాధికోనామకిం=క్షేత్రాధిపతి యనఁగానేమి? శరీరంకింజానాతి=శరీరమును యేదితెలుసుకొ నుచున్నది? జ్ఞానంచప్రసిద్ధమేవ=జ్ఞానమేగదాప్రసిద్ధము. ప్రత్య గాత్మేతి=ప్రత్యగాత్మయనియును, ప్రకృతిపురుషఇతి=ప్రకృతి పురుషులనియును, కూటస్థేతి = కూటస్థుఁడనియును, బ్రహ్మేతి =బ్రహ్మమనియును, ఆత్మేతి=ఆత్మయనియును, క్షేత్రజ్ఞేతి=క్షే త్రజ్ఞుఁడనియును, సచ్చిదానందేతి=సచ్చిదానందమనియును, ప రమాత్మేతి=పరమాత్మయనియును, పరమేశ్వరేతి=పరమేశ్వ రుఁడనియును, ద్రష్టేతి=సర్వమును సాక్షిస్వరూపుఁడై చూచు వాఁడనియును, దృశ్యమి=దృశ్యమనియును, శ్రుతీతి=వేద ములనియును, విజ్ఞానేతి = విజ్ఞానమనియును, ఏతాదినిమిత్య జ్ఞానస్వరూపాణి=ఇవియన్నియు జ్ఞానస్వరూపమనిచెప్పఁబడు చున్నది, జ్ఞానమేవజీవోపాధిః=జ్ఞానమేజీవోపాధియనిచెప్పఁబ డుచున్నది, తస్యైవ=దానికే, అద్వైతసాక్ష=అద్వైతలక్షణ ము, అభేదసాక్ష=అభేదలక్షణము, నిర్గుణసాక్షా = నిర్గుణలక్ష ణము, మాయాఅవిద్యేతిసాక్షా=మాయయనిఅవిద్యయని రెండు లక్షణములు, తస్మాత్=గనుక, వేదేనవేదితం = వేదములవల్లనె ఱుఁగఁబడనిది, మిథ్యేతి=మిథ్యయని, దృఢాభ్యాసం=దృఢము గానభ్యాసముచేయవలసినది, తథా=అట్లగుటవలన, చిద్జడభ్రాం తిరహితం=జ్ఞానజడములైనభ్రమలు రహితమగుచున్నవి. జన్మా దిభ్రాంతిరహితస్య = జన్మమొదలైనభ్రాంతులురహితమైనవా నికి, సర్వశూన్యత్వాత్=సర్వశూన్యమగుటవలన, సర్వశూన్య

మితి=సర్వశూన్యమని, దృఢనిశ్చయమేవ = దృఢముగా నిశ్చయించుటే, విచారస్యహిఫలం=విచారణకుఫలముగదా, సప్రబంధమోక్షరహితః = వాఁడే బంధమోక్షములు లేనివాఁడు. జ్ఞానాజ్ఞానరహితత్వాత్=జ్ఞానాజ్ఞానములురహితమగుటచేత, అతీతం=అతీతమైనయచలమార్గమును, కోవేత్తి=ఎవ్వఁడెఱుఁగును, అంధపురుషవత్=గ్రుడ్డివానివలెనే, అలంవిస్తారభయాత్=ఇఁకనువిస్తరించుటచేత భయమగుచున్నదిగనుక నింతమాత్రమే చాలును.

సుఖోహమస్మీతి=నేనుసుఖియనియనుట, వేదరహితే=వేదశాస్త్రములురహితమగుటవలన, నవేత్తి=ఎఱుఁగడు, తత్సమయే=అప్పుడు. అహంవృత్తిశూన్యత్వాత్=అహంభావము శూన్యమగుటవలన, సుఖం=సుఖమును, కోవేత్తి =ఎవ్వఁడెఱుఁగుచున్నాఁడు, దుఃఖం=దుఃఖమును, కోవేత్తి = ఎవ్వఁడెఱుఁగుచున్నాఁడు, జ్ఞానస్యమూలంకిం=జ్ఞానమునకు మూలమేమి, అజ్ఞానస్యమూలంకిం=అజ్ఞానమునకుమూలమేమి, కోవేత్తి=ఎవ్వఁడెఱుఁగును.అహంవృత్తిజీవోపాధిః = నేననెడువ్యాపారజీవోపాధి, విలయేసతి=లయించుచుండగా,సర్వవేదాః=సమస్తవేదములను, కోవేత్తి=ఎవ్వఁడెఱుఁగుచున్నాఁడు. అహంమాయేతి=నేను మాయాస్వరూపుఁడను. తథా=అట్లు, మదితి=నాదియని, అహమితి=నేనని, త్వమితి=నీవని, జ్ఞానమితి=జ్ఞానమని, అజ్ఞానమితి=అజ్ఞానమని, భేదమితి=భేదమని, బ్రాహ్మణోహం=నేనుబ్రాహ్మణుండని, చండాలోహమితి=నేను చండాలుండని, సగుణనిర్గుణౌ=సగుణనిర్గుణములు రెండును, వ్యవహారే=వ్యవహారకాలమునందు, నివృత్తిస్వభావౌ=నివృత్తిస్వభావములు. పరుషసమయే=ఉత్సాహకాలమునందు, పటాటోపవత్=వస్త్రాలంకారమువలెను, స్వకాలేసత్యవద్భాతి = అది యెంతకాలముండునో అంతకాలము సత్యముగానేయుండును. చంద్రవత్=చంద్రునివలెను, తద్వత్=అదేప్రకారము, కదాచిదేవ జ్ఞాపకః = కొంతవఱకే దానిజ్ఞాపకము, అంధకారవ

త్=చీకటివలెను, జ్ఞాపకరహితః=జ్ఞప్తిలేకపోవుటచేతను, విచారరహితః=చింతలేకపోవుటచేతను, ఉభయరహితః = ఈ రెండునులేకపోవుటచేతను, కదాచిత్=ఒకానొకప్పుడును, అహంవృత్త్యాఖ్య జ్ఞాపకరహితత్వాత్ = నేననెడుజ్ఞాపకము లేకపోవుటచేతను,సర్వశూన్యంనిశ్చయమేవ=సర్వశూన్యమగుటే నిశ్చయము. అహమేవ=నేననువాడే, జీవోపాఖ్యోపాధి సహితః=జీవోపాధితోకూడుకొనినవాఁడు, తస్మాత్=గనుక, తద్విచారవత్=అట్టివిచారణ వలెను, సర్వదా=ఎల్లప్పుడు, ఇదమేవవిచారః=ఇదియే విచారణగా నుండవలయును, ఇదమేన గురూపదేశః=ఇదియే నిజగురూపదేశము, వ్యవహారకాలే=సగ్వృత్తులుగల లౌకికకాలమందును, భోజనకాలే=భోజనకాలమందును, దృఢాభ్యాసః=దృఢముగా నభ్యాసముచేయవలయును. అయమేవ=అట్టియభ్యాసమే, చిజ్జడరహితం=సత్తుచిత్తులులేనిది, క్షేత్రక్షేత్రజ్ఞరహితం=క్షేత్రక్షేత్రజ్ఞులులేనిది, సగుణనిర్గుణ రహితం=సగుణనిర్గుణములులేనిది, ప్రకృతిపురుషరహితం=ప్రకృతిపురుషులులేనిది, జగజ్జీవరహితం=జగజ్జీవభావములులేనిది, సదసద్రహితం=సదసత్తులులేనిది, జ్ఞానాజ్ఞానరహితం=జ్ఞానాజ్ఞానములులేనిది, విద్యావిద్యారహితం=విద్యావిద్యలులేనిది, భేదాభేదరహితం=భేదాభేదములులేనిది, ధర్మాధర్మరహితం=ధర్మాధర్మములులేనిది, ప్రవృత్తినివృత్తిరహితం=ప్రవృత్తినివృత్తులులేనిది, జీవేశ్వరరహితం=జీవేశ్వరులుకానిది, కూటస్థబ్రహ్మరహితం=కూటస్థబ్రహ్మముకానిది, బాహ్యే సర్వశూన్యమితిశ్రుతిః=వెలుపల సర్వశూన్యమని శ్రుతివాక్యము, అంతరే సర్వశూన్యమితిశ్రుతిః=లోపలను సర్వశూన్యమేయని శ్రుతివాక్యము, అయమేవసర్వేషాం=ఇట్లుసర్వకాలములయందును యిదేవిచారణచేయుటయే. భావాభావరహితం=భావాభావములులేని యచలపరిపూర్ణము. టీకా సమాప్తము.



## తా త్ప ర్య ము.

నేనెల్లప్పుడును అచలపరిపూర్ణబ్రహ్మమని జెప్పంబడుచున్నాను. మాయలేనేలేదు. మాయయొకప్పుడు దెలియఁబడి యొకప్పుడు దెలియబడకుండుటే దానికిస్వభావము. గాఁబట్టి, కనఁబడుటకనఁబడకుండుట, రెండును దోషస్వరూపములగుటచేత నట్టి మాయాభ్రాంతిని విడుచుటేధర్మము. మేఘములయందు నిమిషనిమిషమునకు రాకపోకలుగలిగిన మెఱుపులవలెను, ఉత్సవకాలమునందలంకార యుక్తుడైన మనుష్యునివలెను, రాతియందలి నిప్పువలెను, వసంతఋతువునందు అడవియందలికార్చిచ్చువలెను, మిణుగురు పురుగులవలెను, మాయయొఱుకకు రాకపోకలు గలిగియుండుటచేతనది భ్రాంతిరూపకమని జెప్పఁబడుచున్నది అచలపరిపూర్ణమునకు నంతరములేదు, బాహ్యములేదు. కట్టె తోడకట్టెనొరయుటచేతంబుట్టెడు అగ్నివలెను, జ్ఞానాగ్నితనకుఁదానే ప్రకాశించి ఉష్ణస్వభావముగలిగి, దహింపఁజేసెడుగుణము కలిగియున్నరీతిగానే, చిదగ్నియెంతవరకుండునో అంత పర్యంతముండి పిమ్మట యదిలయించును గాఁబట్టి దానికిమూలములేదు. ఉన్నట్టుండి వచ్చుటచేతను, దానిసామర్థ్యముచేతను ప్రసిద్ధమైనది. కట్టెయందుద్భవించిననిప్పు యాదారువునుగాల్చి తానునుసమిసిపోవుచున్నది గాఁబట్టి భ్రమయెంతవరకుండునో అంతవరకునాచిదగ్నియుండును. విచారణచేతనే యొఱుకయనెడు భ్రమనశించియేమియునులేని పరిపూర్ణమేయుండును.

జ్ఞానాగ్నియనునది మేఘములయందలి ఉఱుములవలెను, శంఖనాదమువలెను, భేరిమొదలగువాద్యఘోషములవలెను, పకపకనవ్వెడునవ్వువలెను, కడుపునొప్పివలెను, వ్యసనమువలెను, ఒకానొకప్పుడుకలుగుచున్నది. గాఁబట్టి ఎఱుకయనటుల గనుపించి కనుపించకపోవుటచేతనే, కుందేటికొమ్ములవలెను, గొడ్రాలిబిడ్డవలెను, ఆకాశపుష్పమువలెను, నరునికొమ్ములవలెను, నిష్ప్రయోజనమగుటచేత నీనిల్కడలేనిజ్ఞానమువల్లనే దబ్బరయైనభ్రమగనుక, జ్ఞానమునునిల్కడలేని దబ్బరగానేయున్నది. ప్ర

పంచశరీరములను దెలుసుకొనునదియే క్షేత్రాధిపతి. అదే జ్ఞానమని ప్రసిద్ధము. దానికే ప్రత్యగాత్మయనియును ప్రకృతిపురుషులనియును కూటస్థుండనియును, బ్రహ్మమనియును, క్షేత్రజ్ఞుండనియును, సచ్చిదానందమనియును. పరమాత్మయనియును, పరమేశ్వరుండనియును. సర్వమును సాక్షిస్వరూపుండై చూచువాడనియును, శ్రీమన్నారాయణుండనియును, పరమశివుండనియును, వేదవేద్యుండనియును, విజ్ఞానమనియును, ఇట్టి కారణముల చేతనే జ్ఞానస్వరూపమని చెప్పంబడుచున్నది. గనుక జ్ఞానమే జీవోపాధియని చెప్పంబడుచున్నది.

అదియెట్లనగా జ్ఞానమాకాశతత్వముగా కనుబడు చున్నది. జీవపంచీకరణమునందొకటిగనుక, నదియును దానియందలి ప్రతిబింబములును జీవోపాధియే. మాయాజ్ఞానప్రతిబింబితమైన యీశ్వరుండును అవిద్యాజ్ఞానప్రతిబింబితుండైనజీవుండును, ఈ రెండును ప్రతిబింబములుగనుక దానికేయభేదసాక్ష, అద్వైతసాక్ష, నిర్గుణసాక్ష, ప్రత్యగాత్మ పరమాత్మ ఐక్యసాక్ష, కాంబట్టి, వేదముల వలన నెఱుంగబడినదియగు జ్ఞానమును, తత్ప్రతి బింబములును మిధ్యయేయని దృఢమైన నిశ్చయము కలిగియుండవలయును. అట్లుండిన జ్ఞానాజ్ఞానములయందలి భ్రమలు రహితమగు చున్నవి. అట్లుభ్రాంతిరహితమైనవానికిసర్వసందేహములు శూన్యమగుట వలనను, అచలపరిపూర్ణ బ్రహ్మమునందు సమస్త గుణములు శూన్యమై దోషరహితమగుటవలనను న్ను, సర్వశూన్య మనిదృఢముగా నిశ్చయించుటే విచారణకు ఫలముగదా. అట్లు విచారించి జగజ్జీవేశ్వరభ్రమలను విడిచినవాండే, బంధ మోక్షములు లేనివాండు. జ్ఞానాజ్ఞానములు రహితమగుటచేతను అతీతమైన యచలమార్గము నెవ్వండెఱుంగును, గుడ్డివానివలెనే యున్నాండు, ఇంకను విస్తరించి చెప్పుటకు ప్రకరణము విశేషించునుగాన నింతేచాలును.

నిజస్వరూపమగునట్టియచలము, వేదశాస్త్రములకునలవిగాని, శుద్ధనిర్గుణుండగుటవలన, నేనుసుఖియనియు నెఱుంగడు.

అట్లగుటవలన అహంకారముశూన్యమగునదియగుచున్నది. కాబట్టి సుఖము నెఱుఁగువాఁడెవఁడు, దుఃఖము నెఱుఁగువాఁడెవఁడు, ఇట్టిసుఖదుఃఖముల నెఱిఁగెడు జ్ఞానాహంకారరూపమునకు మూలమేమి? అజ్ఞానమగుజడమునకుమూలమేమి? వీటినియెవ్వడెఱుఁగును? తన్నుఁదానెయెఱుఁగుచున్నది. నేను నేన నెడుజ్ఞానాహంకారములయమగుచుండగా, వేదములనెఱుఁగువాఁడెవఁడు. నేననునదిమాయాస్వరూపముగనుక, నేనునాదియనియెడియహంకార మమకారములును, అనుటయును, జ్ఞానాజ్ఞానభేదములును, నేనుబ్రాహ్మణుఁడను, నీవుచండాలుఁడవనుటను, మొదలుగాగలవన్నియును, విచారణచేసిచూడఁగా నేమిలేకపోవుచున్నవి. పురుషునియుత్సాహకాలమునందువస్త్రాభరణాద్యలంకారములు సుందరముగాప్రకాశించుచున్నవి, మఱలనాపురుషుని దారిద్రదశయందుఁజెప్పక యవిపారిపోచున్నవి. అవియున్నంతవరకు సత్యముగానే కనబడుచున్నవి. అగ్ని, సూర్య, చంద్రులవలెనే యీయెఱుకయనెడు జ్ఞానస్వరూపమున్ను, ఉన్నవర్తకుండి, ఒకానొకప్పుడు లేకనేపోవుచున్నది. మఱలఁజీకటియేలాఁగువచ్చుచున్నదో, అలాఁగుననే అజ్ఞానము పుట్టుచున్నది. ఈయెఱుకయనెడుజ్ఞానాజ్ఞానములు రెండున్ను, విచారించిచూచిమానుకోవడమే, సర్వశూన్యమనునది. ఈజ్ఞానాజ్ఞానములు రెండున్ను శూన్యముకాగా, నిలిచినదేదియో, అదియే యచలపరిపూర్ణబ్రహ్మమని దృఢనిశ్చయముకావలయును. నేను నేనడిజ్ఞానాహంకారమే జీవోపాధి, గనుక విచారణ నిజగురుముఖంబునఁ జక్కఁగాచేయవలసినది. ఇదియేనిజగురూపదేశము. వ్యవహారకాలమునందును, భోజనకాలమునందును, ఇదియే దృఢనిశ్చయముగావలయును. ఇట్టిదృఢనిశ్చయమే, క్షేత్రక్షేత్రజ్ఞభ్రాంతిరహితము, సగుణనిర్గుణరహితము, ప్రకృతిపురుషరహితము. జగజ్జీవేశ్వరభ్రాంతిరహితము, సదసద్రహితము, జ్ఞానాజ్ఞానరహితము, మాయావిద్యారహితము, భేదాభేదరహితము, పుణ్యపాపరహితము, ధర్మాధర్మరహితము, ప్రవృత్తినివృత్తిరహిత

ము, కూటస్థబ్రహ్మరహితము, లోపలవెలుపలసర్వశూన్యమై నిల చినదేదియో, అదియేపరిపూర్ణాచలబ్రహ్మము. ఇట్టిది దృఢపడుటే భావాభావరహితమని తాత్పర్యము.

ఇది శ్రీమద్వేదాంతసారుండును సచ్చిదానందరహితుండును నాదబిందుకళాతీతుండును ప్రకృతిద్వయదోషరహితుండును అచలపరిపూర్ణుండును అశరీరుండునునైన శ్రీమద్గురుశివరామదీక్షితులవారిచే రచియింపంబడిన, శివరామదీక్షితీయమను, అచలగ్రంథము. అట్టియచలగురునిచర[illegible]రవిందారవిందమరందపానతుందిలితా మందమందానందమిళింద బృందంబున నొకండైన పోకల - శేషాచలాహ్వయుండను, అచలభావజ్ఞునిచే పైంజెప్పిన గ్రంథమందలి గీర్వాణభావార్థములకు తాత్పర్యమును, భావాభావరహితప్రకరణమునకు టీకాతాత్పర్యములను,వ్రాయబడి ప్రచురింపంబడిన అచలగ్రంథము సర్వంబును సంపూర్ణము.



అచలుడు. పోకల-శేషాచలాహ్వయుండు.